# లిమ్కా పానం బలే మజా
# కారణాలెన్నో ఉన్నాయి తెలుసా



లిమ్కాలో నాకు విటమిన్ సి లభిస్తుంది. | నిమ్మకాయ కమ్మదనం, జిల్లనే తియ్యని రుచి వుంటాయి. | ఐసోటానిక్ లవణాలు నా దాహం తీరుస్తాయి.




క్రిమిరహితమైన లిమ్కా నా ఆరోగ్యాన్ని పాడవనివ్వదు. | చల్లని లిమ్కా నా మనస్సుకి ఆహ్లాదం కల్గిస్తుంది.

**లిమ్కా**

నిమ్మకాయ నీరులా మజా నివ్వగల పానీయం

RADEUS/PE/L/29

సంస్థాపకుడు
వి.వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 ఆగష్టు 83 సంచిక 7

# ఇదీ వరస...



ఈ నెలా నవలానుబంధం

## తూరుపు కొండలు

## వారాల కృష్ణమూర్తి

జ్యోతి-భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

జ్యోతి పి. బి. నెం. 1824, హైదరాబాద్-20

కమలహాసన్ ముఖచిత్రం

# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి**






2 ప్యాక్‌లలో లభిస్తుంది—'ప్లెయిన్' మరియు 'శాండల్‌వుడ్'

నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శృతిమించకుండ చేస్తుంది.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది. 3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

.HTB-GLL/8808

# నిదురించిన శబ్ద విరించి....

ఆధునిక సాహితీ జీవన ప్రహేళికలో చివరి పదం పూరించిన 'అనితర సాధ్యుడు' అనంత వ్యోమంలో "తెల్లరేకై పల్లవిస్తున్నా"డిప్పుడు.

అతడు ప్రపంచ పద్మవ్యూహాన్ని ఛేదించాడా?!

తిరని కవితాదాహంతో వెళ్ళిపోయాడా?!....

ఎంత కరిగిపోయిందప్పుడే?!....

కవితాలోకంలో "క్లోరోఫారంలా చీకటి" కమ్మింది....

ఆయన "ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం" విన్నారు, 'అగ్ని సరస్సులో' స్నానమాడారు.... ఈదురుగాలిలో ఎంగిలాకు ఎగిరిపడ్డచోట అన్నార్తి కేక గుండెలో విన్నారు.... "ఛందోబందోబస్తులని చట్ ఫట్" మని తెంచడానికీ, సాహితీ "చటులాలంకారపు మటు మాయాల"ని తప్పించడానికీ ఆయన ఎన్నుకున్న "చిర దీక్షా శిక్షా తపస్సమీక్షణ" ఎంత మహత్తరమైంది!!....

అక్కడ ఒకవేపు యూరప్ సాంఘిక చైతన్య వీచికల తాకిడి, రష్యా సింహగర్జన, రెండో ప్రపంచ యుద్ధ కారు మేఘాలు....

ఇక్కడ ఇటు టగూర్ మృదుమధుర బెంగాలీ పరిమళం, గాంధీ ఉద్యమ స్ఫూర్తి, బ్రహ్మసమాజ వైతాళికుల గానం, నవ్యసాహితీ సమితుల కవినందోహాలు, "గుడిపాటి వెంకటచలేయుడు గుండె బాదుకు" చెబుతున్న ఘోష, వైష్ణవ భక్తిగీతాలు, కల్పానిక వాద కవికుమారుల రమ్య విరహ గీతాలు....

ఈ హోరులో విప్లవ ధనుష్టంకారం చేస్తూ సాహితీ కీర్తిచంద్రికల నోయగాన్ని ఎడంకాల్తో తన్ని వెళ్ళడం ఎంత "విలయావర్తపు బలవత్ ఘురవత్ పరివర్తన!"....

"అన్నీ ఒక్కడికి బదులు అందరికీ అన్నీ" అని చెప్పడానికీ, జీవిత మార్గాన్ని ఆవేపు మళ్లించడానికీ ఆయన "మహారాజు మనీపర్సు మాయకాదు.



బిచ్చగాని కడుపు కరువు మయ" కాదని ఏనాడో స్పృశించి తెలుసుకున్నారు.... ప్రచండ లక్ష్య సాధనలో మహాకావ్య సృష్టిచేసి నవ్య ప్రాచీనులనీ, ప్రాచీన నవ్యులనీ సంభ్రమింపజేసి పేదల కడుపు కోతని ధ్వనింపాడు...."నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలయితే నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే"నని సాంఘిక విప్లవ నవ్యమార్గాన్ని సాహిత్యంలో విశ్లేషించి ప్రవచించారు....మనోశక్తినీ, బుద్ధి ప్రేరణనీ సంధించి సంస్కారదాత్మక విప్లవ నాదాన్ని జనహృదయ రాగాలాపనగా చేశారు....

"మెదడన్నది మనకున్నది
అది సరిగా పనిచేస్తే
విశ్వరహః పేటికా వి
స్ఫోటన జరగక తప్పద" ని ఫిరంగిలా గర్జించి పలికేరు....

ఇప్పుడిక లేనిది ఆయన భౌతిక శరీరమే గాని కవితా శరీరం చిరంజీవిగా నిలుస్తుందని మనకీ తెలుసు....

కవితా శ్రీరణరంగం శ్రీనివాసరావుకి విప్లవవారసులు, కవితాయువ వాహిని సమర్పించాల్సిన శ్రద్ధాంజలి-కవిత్వాన్ని ఫాషన్‌గా తీసుకుని, అనుకరణ ప్రహసనంలో తలకిందులవడం ద్వారా కాదు.... విప్లవాన్ని కాల్పానిక లోకంగా మార్చి ప్రజలకీ, కర్తవ్యానికీ సుదూరంగా వుంచడం ద్వారా కాదు.... విప్లవాన్ని అటక మీద పెట్టి ఐడియలిష్టు నమస్కారం చేసి, దరిద్రుడి పేరున డబ్బు చేసుకుంటూ పంచరంగుల పండితలోక విహారం చెయ్యడం ద్వారా కాదు....కాదు.

విప్లవాన్ని వినాదంలోనే శిలువ వేసే సులభ పద్ధతిలో అసలు కాదు.... ఇప్పుడూ చైనాలో పువ్వులా తుమ్మెదలు విప్లవాన్ని ప్రసవిస్తాయనీ, రష్యాలో వోల్గానిండా విప్లవ నినాదం నెత్తుటి రంగులో వుంటుందనే కాల్పనిక మధురోహలు తగ్గించి వ్యక్తిత్వంతో చేతలలో చూపవలసిన విప్లవ కాలం, విప్లవ కవితాఫలీకరణ ముహూర్తం వచ్చిందని గ్రహించడమే శ్రీశ్రీకి శ్రద్ధాంజలి, రెడ్ సెల్యూట్ అవుతుంది....






ఆయన మహాకవి - అంతకుమించి మంచి స్నేహితుడు మా జ్యోతికి...... వెళ్ళిపోయిన స్నేహితుడికి "ఎలిజీలు" రాయలేము.... తీపిజ్ఞాపకాలు గుర్తుచేసుకోడం ఇక మిగిలింది. 1970 లో ఆయన షష్టిపూర్తికి ప్రత్యేక సంచికవేసి ఎడిటోరియల్‌లో "నిత్య నూతన యువ్వనుడు, అంతకంటె పసిబాలుడు, కాదంటే విప్లవ కారుడని" రాసుకుని మురిపోవడం మా కింకా జ్ఞాపకమే! '80 లో ఆయన అస్వస్థతగా వున్నందుకు నిధి వసూలుచేసి, డబ్బు పంపిన వారికి ఆయన చిరునవ్వు ఫొటో పంపడమూ గుర్తే....

"టియర్స్ ఫ్రం ఎండ్ లెస్ హెవన్ ఆఫ్ మెమరీస్" ఖలీల్ గిబ్రాన్ అన్నట్టు.... మా జ్యోతి రాఘవయ్యగారిపై శ్రీశ్రీగారికిగల స్నేహాభిమానం మం మరచిపోలేనిది.... మా కొచ్చే ప్రతి సాహితీ సత్సంశయానికి శ్రీశ్రీ సమాధానం గుర్తే.... జ్యోతి మద్రాసుకి తరలి వచ్చాక ఒక సమయంలో రాఘవయ్యగారికి సంపాదక బాధ్యత, పత్రికా నిర్వహణ బాధ్యత ఆరోగ్య రీత్యా బరువయినప్పుడు

## వచ్చే నెల శ్రీశ్రీ నవరసాల పునః ప్రచురణ

శ్రీశ్రీగారు రాఘవయ్యగారిని వ్యాపార నిర్వహణబాధ్యత తీసుకోమనీ, సంపాదకత్వ బాధ్యత సంపూర్తిగా తానే నిర్వహిస్తాననడం గుర్తే....ఆ మాట నిజమవ్వాలని ఎంతో ఆశించారు రాఘవయ్యగారు. కాని ఆరోగ్యం త్వరితంగా క్షీణించడం ఎప్పటికీ గుర్తు.. ఆఖరికి తన వైద్య విషయంలోనూ శ్రీశ్రీ చెప్పిందే వేదం....ఆయన సలహాయే మందు....తనకి శ్రీశ్రీ గురువు, స్నేహితుడు దైవ సమానుడు. శ్రీశ్రీ సాహిత్యం కంఠోపాఠం.... పసిపిల్లలకి ప్రబుద్ధులకి వుండే చిరునవ్వు, ప్రాపంచిక అమాయకత్వం ముఖంలో సదా కనిపించడం ఎంతో గుర్తు....శ్రీశ్రీ శ్రీశ్రీ ధైర్యంతోటి మా పత్రికను ముందుకి నడిపారు రాఘవయ్యగారు తన చివరినిముషం వరకు....



1976 లో నవరసాలు జ్యోతిలో ప్రచురణకి రాఘవయ్యగారిమీదుండే స్నేహంతో, ఆప్యాయతతో ఇవ్వడం - ప్రచురణ జరగడం తీపిగుర్తు. తరువాత ఆయన తన సినిమా పాటలు ఒక పుస్తకం గాను, జ్యోతిలో ప్రచురిస్తున్న తన ప్రహేళికలు ఒక పుస్తకంగా ప్రచురించాలని ఆయన చిరకాల కోరిక........ అంచేత శ్రీశ్రీ "పదబంధ ప్రహేళికలు"ని వారి శ్రీమతిగారితో సంప్రదించి ఒక పుస్తకంగా

## వొచ్చే నెలే శ్రీశ్రీ నవరసాల పునః ప్రచురణ

అచ్చువేయాలని నిశ్చయించుకున్నాము....జ్యోతి, శ్రీశ్రీ స్నేహానుబంధం జ్ఞాపకంగా వచ్చేనెల నుంచీ "శ్రీశ్రీ నవరసాలు" కొన్ని ప్రచురించదలచుకున్నాము....

అప్పటి సంచికల్లో మేం ప్రచురించిన శ్రీశ్రీగారి హాస్యోక్తులు ఇప్పుడన్ని పత్రికల్లో వొచ్చేశాయిగనుక కేవలం మచ్చుకి ఒకటి రెండు గుర్తుచేసుకుందాం....

**హాస్య శ్రీశ్రీ**............

....మిట్ట మధ్యాన్నం ఎండలో కాళ్ళకు జోడు లేకుండా రోడ్డున నడుస్తున్న శ్రీశ్రీగార్ని చూసి డైరెక్టర్ జగన్నాథ్‌గారు.... "అరెరె శ్రీశ్రీగారూ కాళ్ళకు చెప్పుల్లేకుండా...." వెంటనే శ్రీశ్రీ "....చెప్పుకోవడానికి లేదు" అన్నారు....

విశాఖలో అప్పారావు కొట్లో మజ్జిగ కోసం ఓ పెద్ద మనిషి అడిగితే, కసిరి లేవని పొమ్మన్నాడు అప్పారావు.... అక్కడేవున్న శ్రీశ్రీగారు కలగచేసుకుని ఒక్కన...."లస్సు మాత్రం ఇక్కడ దొరకదండి......" అన్నారు (ఉత్త "మఫ్" మాత్రం దొరుకుతాడనే అర్థంతో....)

ఒకసారి కొడవటిగంటి కుటుంబరావుగారు జ్యోతిలో రాస్తూ........ "ఏదన్నా జోక్ చెప్పి శ్రీశ్రీ హార్దీగా నవ్వితే చూడండి................పసిపిల్లలు తప్ప అంత ఆనందంగా ఎవరూ కనబడలేరు,....,.....శ్రీశ్రీ పక్కనున్నప్పుడు నేను "ఓల్డ్‌మాన్ ఆఫ్ ది హిల్స్" అన్నట్టు ఫీలౌతాను అన్నారు.



## ఎండవల్ల ఎల్లప్పుడూ నల్లబడుతూనే వుంటే
## ఎలా వచ్చేను తెల్లదనం-ఎరుక సేయవే ఓ మనసా!

పుట్టినప్పటినుంచీ, వాళ్ళ శరీరతత్వాల ప్రకారం, ఎక్కువగానో, తక్కువగానో, శరీరం క్రమంగా నల్లబడుతూనే ఉంటుంది. లోపల వున్న కారణం ఒకటి-చర్మం లోపలగల నల్లని రంగు పదార్థం 'మెలానిన్'.



బయట గల కారణం యిదీ-సూర్యరస్మిలోని అల్ట్రావయొలెట్ కిరణాలు.
ఈ రెంటికీ ... ఎరిష్కారం వచ్చిందిక

## విజ్ఞాన పరిశోధన ఫలించింది!

మేం జీవాణువుల యొక్క గర్భగృహంలోకి ప్రవేశించి రంగుల వారాన్ని తీసుకొచ్చాం-నల్లదనాన్ని వ్యాపించకుండా అరికట్టడం, పూర్తిగా కరిగించడం దాంతో ఒక క్రీమ్ ఉదయించింది-ఫెయిర్ అండ్ లవ్‌లీ కఠుకైన రసాయనిక ద్రవ్యాలుగాని, బ్లీచింగ్‌గాని, కలపని సున్నితమైన విధానం.

## చూడండి యిది ఎలా పనిచేస్తుందో!

లోపలా, బయటా రెండు విధాలుగా-

చర్మం లోపల:- చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా నల్లబరిచే ప్రక్రియను వెనుకకుతిప్పి, వంటిచాయను ఎర్రబరుస్తుంది,

చర్మం బయట:- 'సూర్యరస్మిని వడబోసే' ప్రత్యేకమైన పదార్థాలు మీ చర్మాన్ని అల్ట్రావయొలెట్ కిరణాలు నల్లబరచకుండా అడ్డగిస్తాయి.

## ఇది అంత గొప్పగా పని చేస్తుందా!

ఇలాంటి ప్రభావంగల సున్నితమైనది ప్రపంచంలో మరొకటి లేదు కేవలం యీ క్రీమ్ మాత్రమే తన శక్తిని నిరూపించింది, యీ దేశంలోనూ విదేశాల్లోనూ, 7 ఏళ్ళుగా.

కేవలం 6 వారాల్లో మీ కళ్ళతో మీరే చూస్తారు రంగు మారడాన్ని. పూర్తి వివరాలకోసం వీరికి వ్రాయండి

FAIR & LOVELY ADVISER,
P O BOX 758, BOMBAY 400 021.




# ఫెయిర్ అండ్ లవ్‌లీ

నల్లని చర్మాన్ని ఎర్రబరిచే క్రీమ్

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పత్తి

ఇది సహజంగా, మృదువుగా మీ వంటిచాయను పెంపొందిస్తుంది

కొన్ని అప్పటి జ్యోతి సంచికల్లో.... శ్రీ శ్రీ గారి పంచపదులు

గద్య చింతా :



పద్యం

ఎక్కువా లేక గద్యం

ఎక్కువా అనే సమస్య అభేద్యం

ఐనా ఘంటా వాద్యంగా

నేనంటాను రెండూ నాకే నైవేద్యం

సెల్ఫ్ పోర్ట్రైట్ :

విమర్శకుడి టెంపర్‌మెంట్

ఏదో ఒక డిస్కంటెంట్

బ్రతుకుతో ఎక్స్‌పెరిమెంట్

పదాలు పేటెంట్ రసాలు టోరెంట్

సదసత్సమస్యకి సాల్వెంట్ శ్రీశ్రీ

జైంట్.



# పదబ్రహ్మ ప్రహేళిక విజేతలు

పప్పు రామలక్ష్మి-పెద్దపాడు; వి. రమణ కుమారి, హైదరాబాద్. ఎమ్ భాస్కరరావు, హైదరాబాద్. శింగంపల్లి భార్గవీదేవి, తిరుపతి. కె. పురుషోత్తం దైవశిఖామణి, హైదరాబాద్. పి. లక్ష్మి, హైదరాబాద్. టి. వెంకట అప్పారావు, పాలవంచ. ఆర్. రాజ్యలక్ష్మి, హైద్రాబాద్, ఏ. వి. శాస్త్రి, వరంగల్, పి. వి. కృష్ణయ్య, వాల్తేరు, కె గోపాలకృష్ణప్రసాద్, హైద్రబాద్, డి. భాగ్యలక్ష్మి, ఖమ్మం, యం.వి. కృష్ణమాచార్యులు, యస్. మహేశ్వర్రావు, నంద్యాల, నంచెన్న, కర్నూలు, ఎస్. గోపాల్ విశాఖపట్నం, పి. అన్నపూర్ణారావు, విజయనగరం, విజయభాస్కరరెడ్డి, నంద్యాల, బి. శేషగిరి శర్మ నంద్యాల. పొట్నూరు రజనీకాంత్, విజయనగరం, కె సుందరమ్మ, వాల్తేరు, వి. శ్రీరాం

---



సాహితీ ప్రహేళిక ప్రతి గడిలో అడుగడుగునా శ్రీ శ్రీ యే

రెడ్డి న్యూ పాల్వంచ, డా॥ యస్ ప్రభాకర్‌రావు విజయనగరం, బి. బి. ఆర్. కృష్ణమూర్తి పెక్కలి, కొల్లూరు కామేశ్వరరావు హైద్రాబాద్, వై. కృష్ణమూర్తి హైద్రబాద్, బి.హెచ్.ఎల్. యశోధర, విజయవాడ, ఎం.ఎల్.ఎన్. ఆచార్యులు సింహాచలం, పి. సరస్వతి మలికిపురం, జి.పుల్లప్ప, కర్నూలు, జి. ప్రవీణ్ కుమార్ నాగారం, పి. శ్రీరామూర్తి కాకినాద, నరేంద్ర పుదయలక్ష్మి గుంతకల్, ఎన్, వెంకటరమణ గుంతకల్, దయానిధిపాత్రో విశాఖపట్నం, యన్.కె. రామారావు, నల్లగొండ, విజయార్క్‌రాయ్, హైద్రబాద్, మాదిరాజు శివ ప్రసాద్ హైద్రబాద్, అలపర్తి లక్ష్మీతులసి, నందివెలుగు, పీసపాటి శ్రీనివాస విశాఖ, డి. వసుంధర కావలి, పంతుల గోపాలకృష్ణారావు, హైద్రాబాద్.

క్రితం నెల ఒక్కరే పజిల్ గెలిచారు. ఈసారి మహాకవి శ్రీశ్రీ కవితాశీర్వచనాలే పదాల్ని పూరించినట్టు ఇందర్ని పురికొలిపింది ప్రహేళిక పూరణకి ..





# ఉతుకులో ఎంతో జాగ్రత్త...
# అది సన్‌లైట్ సున్నితమైన తీరు.




శుద్ధమైన సన్‌లైట్, మీ బట్టల్ని ఎంతో సున్నితమైన తీరులో ఉతుకుతుంది.... అది కూడా మీ చేతులకు హాని కలిగించకుండా. సన్‌లైట్‌తో మీ తెల్ల బట్టలూ, రంగు బట్టలూ మరింత కాంతివంతంగా, మీరు గర్వించేలా తయారౌతాయి.

**బట్టలెంతో సురక్షితం,**
**సన్‌లైట్ ఉతుకులోని అద్భుతం.**




"ఆ నెక్లెస్ తియ్యొద్దు."

"... ........"

"ఏం వినబడలేదా?" అని అరిచింది భవానీ - ఇవతల గదిలో అద్దం ముందు నిలబడి - చీర చెంగులు బొడ్డులో దోపుకుంటూ.

నెక్లెస్ పెట్టెతో సహా తీసి, గోద్రెజ్ తలుపు మూసి బయటకు కదిలాడు శంకరం, అతని ఎదురుగా వచ్చింది భవానీ

"ఎన్నిసార్లు చెప్పాలి మీకు?.... వారం రోజుల్నించీ యిదేపాట పాడుతున్నా - నా నెక్లెసు పట్టుకెళ్లడానికి వీల్లేదు."

"వారం రోజుల్నించీ నేనూ చెబుతున్నా- బిల్లు పాసై డబ్బు చేతికిరాగానే నీ నెక్లెసు విడిపించి నీకిస్తాను రెండు వేలు ఈ మధ్యాహ్నం లోపల బ్యాంకిలో కట్టాలి. వారం రోజుల్నించీ ఓ చెక్కుని ఆపుచేసి వుంచాను. ఆచెక్కు తిరిగి వెళ్లిందంటే, మనపరువు దక్కదు." అని ఎంతో నచ్చచెప్పాలని ప్రయత్నించాడు శంకరం.

"ఈ నెక్లెసు పెట్టుకుని మా మహిళా మండలి యునివర్సిటీకి వెళ్లకపోతే నా

పరువూ దక్కదు-" అంది మొహం అవెటో తిప్పేసుకుని.

"ఇన్నాళ్లా అన్ని పెట్టుకు వెళ్లావుగా? ఇవాళ లేకపోతే, నిన్ను నిలబెట్టి ఆరా తీస్తారా మీ మహిళా మండలి సభ్యులు?"

"అదంతా నాకనవసరం నేనివ్వనన్నాను అంతే-"

"ఏం? ఎందుకని?" అని రెట్టించాడు శంకరం.

"ఎందుకేమిటి? వ్యాపారం లో నష్టం, నష్టం అంటూ- డబ్బు చేతికందగానే సర్దుబాటు చేస్తానని పట్టుకెళ్లినవి చాలు- నన్ను నా పిల్లల్ని ఇలా బతకనీండి-"

# (అ)గమ్యం



"అంటే-?"

"అంటే అర్థం కాలేదా? ఇకనించి మీబతుకు మీది నాబతుకు నాది." అంది చాలా నిష్కర్షగా-

"నోర్మూయ్-" అంటూ చెయ్యెత్తాడు శంకరం.

"ఏం కొడతారా? కొట్టండి . . నా బతుక్కి అదొక్కటే తక్కువ.... ఇంత బతుకూ బతికి, మీచేత తన్నులు తినలేను. పొండి మీరు మీ నగలూ నెత్తి

నెట్టుకుని పూరేగండి-" అంటూ మెడలో మంగళ సూత్రం విసిరేసింది.

"ఇకనుంచీ నాకు మొగుడు లేడను కుంటాడు. నాకు అక్క, అమ్మ వున్నారు. వాళ్ల దగ్గరుంటాను- లేదా, లేదా, వుద్యోగం వెతుక్కుంటాను నేనూ నా పిల్ల బతకలేక పోం-పొండి" అంటు బొట్టు చెరిపేసుకుని గదిలోకి వెళ్ళింది భవాని.

"బొట్టు ఎందుకు చెరుపుకుంటావ్? నే రాకముందునుంచీ వున్నదే గా? ఇంద... ఈ మంగళసూత్రంలో ఈ ఒక్కటీ మాత్రం నాది నానుతాడు రెండోదీ నీదే- నీదగ్గరే వుంచుకో-" అని గదిలో మంచంమీద పెట్టేశాడు పెట్టె పక్కన.

పెట్టెలో తన బట్టలు సర్దుకుని మంగళసూత్రం అందులో పడేసుకుని గబగబా బయటకు వచ్చేసింది భవానీ. గది గుమ్మం చాటునించి బెరుకు బెరుకుగా చూస్తున్న పాపను లాక్కు వచ్చింది. చర చరా మేడ దిగి వెళ్లి పోతోంది శంకరం అలాగే మంచం మీద వాలిపోయాడు. తలకింద చేతులు పెట్టుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

భవానీకి యిలా కోపం రావడం మామూలే- అలిగి అమ్మదగ్గరకు వెళ్లి పోవడమూ మామూలే- ఈ పదేళ్ల కాపురంలోనూ కనీసం పదిసార్తయినా వెళ్ళివుంటుంది. కాని ఇవాళ వెళ్తున్నట్టుగా ఎప్పుడూ లేదు. ఇంతకాలం తన సుఖాన్నిఆమెకుపంచాడు అతని సంపాదన ఆమెకు యిచ్చాడు. ప్రస్తుతం వ్యాపారంలో ఒడుదుడుకులు వచ్చాయి. కాస్త తప్పు సి ధైర్యంగా నిలబడాలి. కాని, ఆమె అలా చెయ్యలేదు. ఎందుకు యింత నిర్లక్ష్యంగా వెళ్ళి పోయింది? ఇది ఆమెకు పుట్టిన బుద్ధి కాదు. ఎవరైనా చెప్పిపెట్టారా? ఏమో!

"అమ్మా భవానీ" అంటూ కింద వాటా పిన్నిగారు ఓ గరిటె పుచ్చుకుని వచ్చింది. ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడు శంకరం.

"కాఫీ పొడి కాస్త వుంటే" అంటూ నసిగింది ఆమె.

ఆమె చేతిలో గరిటె తీసుకుని లోపలకు వెళ్లి గరిటెడు కాఫీపొడి తెచ్చి యిచ్చాడు.

"భవానీ లేదా బాబూ!" లేదని తెలిసి అడిగినట్టు అనిపించింది శంకరానికి.

"మీకొ్కావలసింది కాఫీ పొడే గా" అన్నాడు ఇహ వెళ్ళండి అన్నట్టు.

"అపుననుకో అంటూ ఆమె వెళ్ళిపోయింది.

భవాని ఆటోచేసుకుని నేరుగా సెంట్రల్ స్టేషన్ కి వచ్చింది. రాజ

పం|డికి టిక్కెట్ తీసుకుంది. రైలు అప్పుడే ప్లాట్‌ఫారం మీదికి వస్తూండటం చేత ఖాళీగానే వుంది. ఆమెకు కిటికీ పక్కకు సీటు దొరికింది. పైన బెర్తు ఖాళీగావుంది దానిమీద దుప్పటి పరిచి, పెట్టె, తలగడ పెటింది. కిటికీ మీద చేతులు ఆనుక్కొని బయటకు చూస్తోంది పాప ఆమె ఒడిలో తల పెట్టుకుని పడుకుని వుంది.

"ఎల్లుండి సర్కారుకి నేను స్టేషన్ కి వస్తాన్లే. మీ ఆవిడ పాప వస్తున్నారు సామాను అదీ వుంటుందిగా" అంటూ ఓ స్నేహితుడు మరో స్నేహితునికి వీడ్కోలు చెబుతున్నాడు.

ఆమాట విన్నది భవానీ. "అవును ఆ స్నేహితుడులాగే ఆమె భర్తకూడా ఆమెను వెతుక్కుంటూ రావాలి" అనుకుంది

ఆ స్నేహితుని చేతిలో మొగలిపువ్వు, మరో చేతిలో స్వీట్స్ ప్యాకెట్ ఆమె చూసింది తనకి మొగలిపువ్వుఅంటే ఇష్టం ఆయన పట్టుకువస్తారు తనను బతిమాలతారు. తప్పయి పోయింది క్షమించమంటారు. నేను క్షమించను, ఎన్నిసార్లు క్షమించడం? అంటూ తన నిర్ణయం తనలోనే చెప్పుకుంది. బండి కదలబోతూంటే, ఓ ప్లీడరుగారూ, ఓ నెల్లూరు రెడ్డిగారూ ఎక్కారు.

"మీకేం బెంగ అక్కర్లేదు రెడ్డిగారూ మీ అమ్మాయికేసు నెగ్గడం ఖాయం. భర్తసంపాదనలో సగం ఇప్పిస్తాను. పైగా మీ మనవరాలు పెళ్ళికిగాను కొంత డబ్బు తీసుకుని దాన్ని బ్యాంకిలో. ఆ పిల్ల మైనారిటీ తీరే వరకూ వేయిస్తాను. జడ్జిగారు కూడా చాలా మంచివాడు ఆయనకి యమ తిరుగుళ్లు తిరిగే మగాళ్ళంటే అసహ్యం ఆయన దేముడు దైవభక్తి వున్నవాడు. ప్రతి శుక్రవారం కరుమారియమ్మ గుడికి వెళ్తాడు. ఎప్పుడూ అమ్మవార్ల గుడికే వెళ్తాడుగాని. శివాలయాలకీ విష్ణుఆలయాలకీ వెళ్ళడు. ఆడవాళ్ళంటే ఆయనకి అభిమానం" అంటూ ప్లీడరుగారు రెడ్డిగారికి ధైర్యం చెబుతున్నాడు. ఈమాట వింటున్న భవానికి ఆ కేసు తన కేసులాంటిదే అనిపించింది. ఆ అమ్మాయిలాగే ఆమెకూడా ఎందుకు కోర్టుకు వెళ్ళకూడదూ? భర్తనించి విడాకులు ఎందుకు పొందకూడదూ?.... తనూ, తనకూతురూ, తన మహిళా మండలి చాలు. వుద్యోగం చేయాల్సిన అవసరం లేదు. మహిళామండలికి గౌరవ అధ్యక్షురాలిగా వుండమని బతిమాలుతున్నారు. వాళ్ళిచ్చే రెండు వందలు చాలు. గౌరవానికి గౌరవం హోదాకి హోదా. సంపాదనకి సంపాదన అంతే. 'నేనుమాత్రం ఆయన దగ్గరకు వెళ్ళను' అనుకుంది.




రైలు నెల్లూరులో ఆగింది. మొగలి పువ్వుభక్తి, రెడ్డిగారు, ప్లీడరుగారూ దిగారు.

గబగబ ఒకావిడ వచ్చింది. లంఖిణిలా ఉంది కిటికీలోంచి సామాను అందుకుంది. అంతా సీటు కింద సర్ది భవానికి ఎదురుగా కూర్చుంది ఆమె పక్కన ఆమె తాలుకు ముగ్గురు ఆడపిల్లలు వచ్చి కూచున్నారు. వాళ్ళంతా 16,20 మధ్యలో వున్నారు. పెళ్ళిళ్లు కాలేదు. భవాని సీట్లోనే కూచుని జోగుతోంది. ఎదురుగా కూచున్న లంఖిణి ఆమెను పరీక్షగా చూసింది. భవానికి వయసు మళ్ళలేదు. ఎనిమిదేళ్ళకూతురు, బొట్టులేదు, మెడలో మంగళసూత్రం లేదు-లంఖిణికి ఏదో ఆలోచనవచ్చింది, చాలా సానుభూతి కలిగింది.

"మేం గుడివాడ వెళ్తున్నాం మీరే వూరు వెళ్తారో? మొగం చూస్తే మీరు ఏదో కష్టంలో వున్నట్టున్నారు"

భవానీ ఆమెవంకచూసి తలవంచేసుకుంది. లంఖిణి మళ్లీ మొదలెట్టింది.

"చూడమ్మ మాది గుడివాడే పాటిమీద మాయిల్లు 'సీతాలక్ష్మి' అని అడిగితే, ఏ రిక్షావాడైనా తీసుకొస్తాడు. ఈళ్ళు నాపిల్లలే సెలవలకి నెల్లూరొచ్చారు." అని పిల్లల్నికూడా పరిచయం చేసింది. చదువుతున్న విజయచిత్ర, జ్యోతిచిత్ర, సితారా పత్రికలు ముఖాలకి అడ్డుతీసి భవానీవంక చూశారు వాళ్ళు- ఓనవ్వు పడేశారు నమస్కారానికి బదులుగా. లంఖిణి వుపన్యాసం మళ్లీ సాగించింది.

"చూస్తే, నువ్వు దిగులుగా కనబడుతున్నావు కావాలంటే, మావూరు రామ్మా నా దగ్గరుందువుగాని - తల్లి లాంటిదాన్ని - నీకేలోటు రానీయను - ఈ ముగ్గురితోపాటు నువ్వు నాలుగు . ఇంకేంతా . నాలుగేళ్లు ఓపికపడితే, పిల్లచేతి కిందొస్తుంది. అప్పుడు నువ్వే నాలుగురికి దారి చూపిస్తావు తొందరేంలేదు మేం బెజవాడలో దిగుతాం నువ్వు బాగా ఆలోచించుకుని చెప్పు. భయాలేరాదు - ఎప్పుడైనా - సరే నీ ఇష్టం-సీతాలక్ష్మి అంటే గుడివాడలో ఏ రిక్షా వాడైనా తీసుకొస్తాడు. పడుకోమ్మ - పాపం నిద్దర్లేనట్టుంది పైన దుప్పటి ఎవర్దీ? నీదేనా? ..నే బెజవాడలో దిగిపోతా. అప్పుడు నువ్వు పడుకో-" అని లంఖిణి పైకెక్కి పడుకుంది. ఏదో పరధ్యానంగా వున్న భవాని-ఆమె పట్టించుకోలేదు తన ఆలోచనల్లో తాను వుంది. కాస్సేపు జోగడం-మళ్లీ మెలకువ రావడం-ఇదీ వరస

రైలు ఒంగోలులో ఆగింది. ఓ పన్నటి ఆవిడ ఎక్కింది.

"అమ్మాయ్! నువ్వు కాళ్లు బార చాపుకుంటే ఎలాగ తల్లి? ఇవతల మేమూ టిక్కట్టుకొన్నాం మేమూ మనుషులమే" అంది.

విజయ చిత్ర చదువుతున్న అమ్మాయి కాళ్లు ముడుచుకుంది. సన్నటి మనిషి ఆమెపక్కన కూచుంది. ఎదురుగా భవానీని చూసింది.

'అడక్కూడదుగానీ - అవునూ.... - మీ వారు ఏం చేసేవారు? ..ఇప్పుడు మీ పుట్టింట్లో వుంటున్నారా? అత్తింట్లోనా?" అని అడిగింది.

"నట్టేట్లో" అంది భవానీ విసుగ్గా

"ఏందీ ఆడకూతురు గదాని అడిగాను-ఆ మాత్రాని అంత కోపమా? మేమూ చూశాం సుఖ మహా వాళ్ళని- నీ బతుకు నా బతుకులాగే తెల్లారింది గనుక అడిగాను" అంటూ కళ్ళజోడు తప్పించి, తన తెల్లచీర కొంగుతో కళ్ళనీళ్లు తుడుచుకుంది వెంటనే అమ్మాయిల వైపు తిరిగి

"మీరేడకా అమ్మాయ్? "అంది

"గుడివాడ-"

"ఏం చదువుతున్నారో?"

"విజయచిత్ర, జ్యోతిచిత్ర, సితారా" అన్నారు ముగ్గురూ ఏక కంఠంతో.

"బాగుంది వరస పోనీ - ఏదో నాకు చెల్లెల్లా వున్నారుగదా అని అడిగాను బెజవాడలో నేను దిగిపోతాను. అంతవరకూ నోరు ముసుక్కూచోడం నా వల్ల కాదమ్మో? ఏదో ఆడవాళ్లం-

# గోద్రెజ్ స్టోర్‌వెల్

## ఖరీదైన స్టీలు అలమారా ఎంతోకాలం మన్నిస్తే చివరికి చవకగా ఎలా పడుతుందంటే!



ఎందుకంటే దీనిలో మీకు: మరింత మన్నిక, మరింత భద్రత, మరిన్ని రకాల్లో ఎంచుకునే వీలు.

### ఇప్పుడు అందమూ, మన్నికా కోసం గీట్లని నిరోధించే ఫినిష్‌తో.

**మరింత మన్నిక:**
గోద్రెజ్‌కే ప్రత్యేకమైన ఆటోమేటిక్ ఎయిర్‌లెస్ ఎలక్ట్రోస్టాటిక్ పెయింటింగ్ ఎక్విప్‌మెంట్‌ను వాడి తద్వారా అత్యంత ఉత్తమమైన ఫినిష్‌ను తెచ్చారు స్టోర్‌వెల్‌కి.

తుప్పు నుండి నిరోధం కోసం ప్రత్యేకమైన ప్రక్రియను చేశారు—దీనిని ఉత్తమ నాణ్యత గల ఉక్కుతో తయారుచేశారు అందుకే స్టోర్‌వెల్ మరింత కాలం అంటే తరతరాలుగా నిలిచి పనికొస్తుంది

**మరింత భద్రత:**
లాకర్‌కి దర్వాజాకి, మరో తాళం చెవితోనూ తియ్యలేని గోద్రెజ్ తాళం. గోద్రెజ్‌కే ప్రత్యేకమైన, పైకి కనిపించని బందులూ, దర్వాజాని పైనుంచి కింద నుండి మూసి వేయడానికి త్రి-వేలింగ్ బోల్టు

**మరిన్ని రకాల్లో ఎంచుకునే వీలు:**
మీ ప్రతిబింబంలో ఎగుడు దిగుడులు లేకుండా ఉండేలాగ, నిగనిగలాడేటి "ఫ్లోట్ గ్లాస్" నిలువుటద్దం (187 సెం.మీ.) పై నుండి క్రిందదాకా మీ ప్రతిబింబం పూర్తిగా కనిపించేలా.
పైకీ క్రిందికీ వీలుగా జరుపుకోగలిగే షెల్ఫులు టయ్-బార్, హేంగింగ్ రాడ్. అనేక కలయికల్లో, వీలుగా వుండేలా.
3 రంగుల్లో—ఆలివ్ గ్రీన్, స్మోక్ గ్రే, టి.వి. గ్రే.

**తేలికగా దొరికే వీలు:**
దేశమంతటా గల 400 డీలర్ల ద్వారా తేలిగ్గా దొరుకుతుంది.

గోద్రెజ్ Godrej ®

మెరుగైన టెక్నాలజీ, మెరుగైన విలువ.



తెలుగు కవితని
జలతారు పరదాల మాటున
జనాల్లోకి రానీయకండా
జనావాల్లో నిర్బంధిస్తే
మహార్భాటనంతా
మహా ప్రస్థానం రాస్తో
తూరుపుమీదో కాలూ
సూర్యుడిమీదో కాలూ
మోపాడు శ్రీ శ్రీ
తెల్లజండా కట్టిన
నెత్తురు కలమూపాడు శ్రీ శ్రీ
కలాన్ని కలానికేసి సంధించాడు
శ్రీకి శ్రీకి మధ్య
ఒక సారస్వత మహాయుగాన్ని
బంధించాడు

-తనికెళ్ళ భరణి

అందులోనూ తెలుగు వాళ్ళం ఉన్న తర్వాత, ఆ మాత్రం మాటా మంతీ లేకుండా ఎట్లా ? ఆయన లేకపోబట్టి గాని-ఆయనే వుంటే, నన్ను పరుపులు పెట్టెలో ఎక్కించేవారు. ఎప్పుడూ ఇద్దరుండే గదిలోనే వుండాలనే వారు. రైలుకదాల్లం భయం. తలుపు మూసేసి ఓహాతే కబుర్లు-" అంటూ ఏడుపు మొదలెట్టింది.

"ఏడవకండి, అక్కయ్యగారూ రోజులు ఎప్పుడూ ఒకలా వుండవు" అంది జ్యోతిచిత్ర.

"నా తల్లే - నా అమ్మ- నువ్వు ఆ ఎదర సీట్లో కూడో అమ్మా-నే కాస్త కాలు చాపుకుంటాను" అంది జ్యోతిచిత్ర ఎదరి సీట్లోకి వెళ్ళింది. రైలు పోతూనేవుంది. రైలు వేగాన్ని మించిన వేగంతో భవానీ ఆలోచనలు-పాప నిద్రపోతోంది. భవానికి నిద్రలేదు.

రైలు బెజవాడ చేరింది. లంఖిణీ అండ్ పార్టీ దిగారు.

"ఎల్లాసమ్మ-సీతాలక్ష్మి- పాటిమీద గుడివాడలో ఏ రిక్షావాడైనా తీసుకొస్తాడు-" అని లంఖిణి కదిలింది. ఒంగోలు ఆవిడ మాత్రం, భవానీకేసి యెగాదిగా చూసి దిగింది.

భవానీకి ఆవిడ మొఖం, మెడ బోసిగా కనిపించాయి అప్పుడు గుర్తొచ్చింది తన మెడ ముఖం కూడా బోసిగా వున్నాయని, అందుకే ఆమె తనని వితంతువు అనుకున్నదని తోచింది పెట్టె తెరిచింది. దాంట్లోంచి మంగళ సూత్రం తీసి, మెడలో వేసుకుంది. కాని, ఆమె దగ్గర తిలకం లేదు. పక్కనున్న మరో ఆవిడని అడిగి తీసుకుంది. కుంకుమ పెట్టు




కుని కూచుంది. బెజవాడలో ఇంకో ఆవిడ ఎక్కింది.

"ఇది ఆడవాళ్ళ పెట్టెగాదూ? మగాళ్లు కూడా ఎక్కారేవిటి?" అంది.

"అమ్మా! ఇదా ఆడవాళ్ళ పెట్టెకాదు. మగవాళ్ల పెట్టెకాదు - మనుషుల పెట్టె - కాస్సేపు నన్నిలా వేలాడనీయండి - ఏలూరులో దిగిపోతాను. మా ఆవిడకి మాత్రం మీ పక్కన కాస్తచోటు యివ్వండి - అదసలేవట్టె మనిషి కూడా కాదు" అని బతిమాలాడు.

ఓ ఎన్.జీ.వో, ఆయన భార్యా. ఇద్దరు ఆడపిల్లలు మరో పిల్ల చంకలో - చేతిలోనే సంచితో ఆమె యెక్కింది

"ఏమండీ! పిల్లల్తో కల్సి మొత్తం పనిమిది శాల్తీలు లెక్కచూడండి" - ఆజ్ఞాపించింది.

"లెక్క చూశాం నువ్వెళ్ళి పిన్నిగారి పక్కన కూచో" అని విసుక్కున్నాడు.

విజయవాడ పిన్నిగారు భవానీని చూస్తూ, కాస్త అటు జరిగింది.

"ఏం వుద్యోగమో?" అంది - భవానిని. భవానీ ఏమీ మాట్లాడలేదు.

"ఆడది బయటికెళ్ళే రోజులు కావు. మాయదారోళ్లు మెళ్ళో పుస్తెలే తెంపుకు పోతున్నారు. పాపం! చూడండి - ఈవిడ అదృష్టం బాగుంది. ఓ బిళ్ల తెంపుకు పోయినా, రెండోది మిగిల్చాడు" అంది. భవానీకి చురక తగిలింది. అసలు తన మంగళ

న్యూతాన్ని తెంపింది యెవరు? దానికి కారణం ఏవరు? తను కదూ? తనలో ఏదో బాధ. అంతలోనే మళ్ళీ ఏదో గర్వం. నెల్లూరు. ప్లీడరుగారి మాటలు గుర్తొచ్చాయి. అంతలోనే ధైర్యం. రాజమండ్రి చేరింది రైలు.

అక్కయ్య వచ్చి ఆమెకు స్వాగతం చెబుతుంది అనుకుంది భవానీ. ఆమె రాలేదు. బావ రాలేదు. వాళ్ళ అబ్బాయీ రాలేదు. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. అందుచేతనే వాళ్ళు రాలేదేమో

"అమ్మ! కూలీ!" అంటూ కూలీ లోపలకు వచ్చాడు.

"ఆ పెట్టి, తలగడ దుప్పటీ" అంది భవానీ. నిద్రపోతున్న పాపను తాను ఎత్తుకుని కదిలింది.

"అమ్మ! లాడ్జీగ్గాని ఎల్తారేంటి?" అన్నాడు కూలీ.

"అక్కర్లేదు ఈ బెంచీ మీదపెట్టు-చాలు" అంది భవాని.

దుప్పటి పరచి, తలగడ దాని పక్కన పెట్టి వెళ్ళాడు కూలీ.

పాపను పడుకోబెట్టి కూలీని పంపించి భవానీ. తానూ బెంచీమీద కూచుంది.

బావ హ్యాంపుకి వెళితే, రగు అయినా రావాలి. వాడూ రాలేదు టెలిగ్రాం అందలేదా? ఒకవేళ తానే వాళ్ళింటికి వెళ్ళిపోతే? ఇల్లుమారారు కొత్త యెడ్రసు తాను తెచ్చుకోలేదు పోనీ బస్సెక్కి అమ్మగారివూరు వెళ్ళిపోతే? ఏదీ యిదమిద్ధంగా తేల్చుకోలేక అలాగే బెంచీ మీద కూచుని ఓవర్ బ్రిడ్జి మెట్ల వైపు మాస్తోంది. వచ్చేజనం పోయే జనం ఆ జనంలో రగులేడు బావ లేడు అక్కయ్యా లేదు ఆమెను మాత్రం ఏమీ పాలు పోవడం లేదు.

గతరాత్రి రైలుప్రయాణం, దాంట్లో జనం వాళ్ళమాటలూ గుర్తొచ్చాయి. ప్లీడర్ని దావా పెట్టిమెయ్యడమా? కేసులో తాను నెగ్గినా సంఘంలో గౌరవం ఏమిటి?

## నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
## దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది

**ఎలాగో చూడండి**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం: అన్నిటికన్నా [illegible], దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి దంతక్షయాన్ని ఎదుర్కోండి.

[illegible]

CBE 882 86 TL

# సాహిత్యం

ఈ సాహిత్యపు పూల మొక్క-
మంత్రులూ, ఆఫీసర్లూ
పోసిన నీళ్ళతో-
ఏపుగా ఎదిగింది।
ఇది ఏనాడైతే అందంగా
పూలు పూయడం ప్రారంభించిందో-
ఆనాటినుండీ-
తుమ్మెదలూ, తేనెటీగలూ,
పస్తులుండడం ప్రారంభించాయి।

ఒరియా మూలం- భగవత్‌ప్రసాద్‌రథ్

అనువాదం - జ్యోత్స్న

గుడివాడ లంఖిణీ మాటలు గుర్తొచ్చాయి. ఆడది ఒంటరిగా బతకలేదా? గౌరవంగా బతికే మార్గంలేదా?

తాను తొందర పడిందా? మళ్ళీ భర్త దగ్గరకు వెళ్ళిపోతే? మొగలిపువ్వు భర్త భార్యకోసం వెళ్ళినట్టు పోనీ భర్తకోసం తాను వెళ్ళితే " నో నో నేవెళ్ళను" అనుకుంది.

"అమ్మా లాడ్జింగ్‌కి రిక్షా"

"ఎవరూ వచ్చినట్టులేదు- ఎక్కడికెళ్తారమ్మా" అన్నాడు ఇందాకటి కూలీ.

""అదే ఆలోచిస్తున్నా" అంది భవానీ

"దయచేసి వినండి. హూపురానించి మదరాస్ వెళ్ళే స్పెషల్‌రైలు ఒకటో ప్లాట్ నెంబరు ఫామ్‌మీద సిద్ధముగా వున్నది" అని ప్రకటన వినబడింది

"ఏమ్మా సామాను తెస్తా బయట రిక్షా కుదిర్చి పెడతా."

"వుండెహే- లాడ్జింగికి వస్తారు."

"నువ్వుండెహే-"

'అసలెక్కడికెళ్లాలమ్మా?' అన్నాడు ఇందాకటి కూలీ

"మెద్రాస్" అంది భవానీ

"మెద్రాస్‌నించే గదమ్మా వచ్చారు" అన్నాడు కూలీ

"అవును వచ్చిందీ మెద్రాస్‌నించే వెళ్ళేదీ మెద్రాసే" అంది భవానీ ఏదో నిర్ణయంతో

**అబ్బబ్బ! మా వాడి తపన చూడడం నా తరం కాదు బాబూ
ఎంతగా అల్లాడి పోతాడో పాపం.
చూశారా, స్కూల్నించి వస్తూ శుబ్బరంగా తడిశాడు...
ఈ పాపిష్ఠి జలుబు తెచ్చుకున్నాడు.**



పోయినసారి వాడు తడిసొచ్చినప్పుడు భయంతో నాకు వణుకు పుట్టింది. ఆ తుమ్ములూ, ఆ ముక్కు కారడం. అబ్బ! ఒక ఒళ్లంతా నొప్పులని అన్నాడు. నేనేమో వెంటనే వాడి వళ్లు తుడిచి పక్క మీద పడుకోబెట్టాను. ఆపైన విక్స్ వేపొరబ్ వాడి ముక్కుపైనా, గొంతుపైనా, ఛాతీ పైనా, ఇంకా వీపుపైన కూడా బాగా రాశాను. విక్స్ ఛలవే అనాలి ..నా బాబు రాత్రంతా చక్కగా నిద్రపోయాడు. తెల్లారగానే హుషారుగా స్కూలుకు వెళ్లటానికి తయారయాడు. ఏమిటో, వాడి ఉత్సాహం! అదిగో.. హూష్ కాకీ!

ఇంక నాకేం [illegible]!

ఎప్పుడూ పనిచేసే విక్స్ వేపొరబ్ సీసా తయారుగా దగ్గరుంచుకుంటూ, నా బాబు హుషారుగా ఉంటాడని తెలిసి తృప్తిగా ఉంటా!

## విక్స్ ఇచ్చే అభయం
## మీ ఆప్యాయతకు సమానం

విక్స్ వేపొరబ్ జలుబు లక్షణాల్ని త్వరగా తగ్గిస్తుంది. ఎందుకంటే దానిలో రెండు విధాల పనిచేసే శాస్త్రీయ సూత్రం ఉంది. దాని ఔషధ యుక్త ఆవిర్లు మీ శ్వాసనాళాల్ని తెరిచి హాయిగా గాలి పీల్చుకోనిస్తాయి. ఒక దాన్ని చర్మంపై రాసినప్పుడు ఒళ్లు నొప్పులు ఉపశమిస్తాయి. అందుకే, ఇది కుటుంబానికంతటికీ అతి విశ్వసనీయమైన జలుబు మందయింది.




**విక్స్ వేపొరబ్**




జూలై నెల జ్యోతి నందమూరి తారక రామారావుగారి ముఖచిత్రంతో క్రొత్తదనం సంతరించుకొంది. వార్షిక పోటీ పెడుతున్నందులకు అభినందనలు ముఖ్యంగా మీరు చాలా తమాషా కథలు కార్టూన్లు ప్రచురిస్తున్నందులకు చాలా సంతోషం.

ప్రణయ వీచికలు సీరియల్ ప్రేమ హృదయాలలో పన్నీటిజల్లు కురిపించేవిలా వుంది. ఏ.బి.సి. వారి వర్తమానంలో నా అభిమాన జ్యోతికే ప్రథమ స్థానం రావడం హర్షదాయకం. సంపాదకులకు నా ధన్యవాదములు!

లక్కరాజు ప్రఫుల్లచంద్ర, ధర్మవరం

o o o

జూలై నెల జ్యోతిలో వమ్మి వీర భద్ర రావుగారి నవల 'శిథిల సంధ్యా గగనం' రియల్లీ సూపర్బ్. నాగరికతా వ్యామోహంలో మనిషి కోల్పోతున్న దేమిటో చక్కగా చిత్రించారు. నాగరిక జీవితం కోసం తండ్రీ కొడుకుల అనుబంధాల్ని భార్యా భర్తల ప్రేమనీ పిల్లల భవిష్యత్తునీ అన్నింటినీ పణంగా పెట్టాల్సిన పరిస్థితిని చాలా చక్కగా చిత్రించారు రియల్లీ మేన్ హేస్ టు ఒ ప్రైస్ ఫర్ సివిలైజేషన్, హౌ వేల్యుబుల్ ప్రైస్!

-స్వరాజ్యోత్స్న, రాయగడ

o o o

జూలై నెల పత్రికలో హాస్యామృతాలలో "కరాటే చదువులు" గూర్చి వెంబ్రం శెట్టి రాయుగారు చాలా చక్కగా వ్రాసారు చదువుతుంటే నవ్వాపుకోలేక పోయాము. ఇలాగే ప్రతినెలా నవ్వులతో (మన) జ్యోతిని మరింత వెలుగు నింపుతారని కోరుతూ రచయితకు అభినందనలు తెలుపుకుంటూ

-ఎస్వెన్ రాజు, సీతంపేట.

o o o

జూలై నెల జ్యోతి నవలానుబంధం "శిథిల సంధ్యా గగనం" చదివిన తర్వాత జీవిత సత్యాన్ని కొన్నింటిని టి. వి లో చూసినట్లనిపించింది. అందులో చక్రపాణిలాంటి వ్యక్తులు నిజ జీవితంలో చాలమంది తెలియుట చేత ఒక వింత అనుభూతిగా ఉంది. నవల చదువుతున్నంతసేపూ ఇలాంటి నవల ప్రచురించిన మీకు, రాసిన వీర భద్రరావుగార్కి నా హృదయపూర్వక అభినందనలు.

-వి. శ్యామసుందర్, తుని

# ప్రణయ వీచికలు

మూలం: బార్బరా కార్ట్‌లాండ్
స్వేచ్ఛానువాదం: భానిరెడ్డి సీతాదేవి

## జరిగిన కథ

(సంభ్రమంతో తలకిందులయ్యే వేళ సీతకి "అతను" కనిపించాడు - కని పించి చెప్పిందంతా ఏదో మాయాజాలంలా అందంగా తోచింది, కర్మ సిద్ధాంతం. జీవన పోరాటం చెప్పాడు-ధైర్యాన్నిచ్చాడు. ఇప్పుడు కేబిన్, హార్వే, కష్టం-ఏదీ లేదు-అంతా "అతనే" అతని కోసం ఎదురుచూడ్డం....)

## జరుగుతున్న కథ

తనను గురించి ఆలోచిస్తూ ఉండి ఉంటాడు. కాదు అతను తనను గురించి ఆలోచించడంవల్లనే తనూ అతన్ని గురించి ఆలోచిస్తున్నది. అతనికి తన భావాలను మరొకరికి అందచేసే శక్తి ఉంది.

అలాగని అతనే చెప్పాడు,

అసలు అతనెవరు ?

ఎందుకు ఈ షిప్‌లో మారువేషంలో ప్రయాణం చేస్తున్నాడు.

అతనిలో ఏవో అద్భుత శక్తులు ఉన్నాయి

అసలు అతను ...మనిషేనా....లేక

సీత వెన్నెముకలోకి ఏదో జరజరా పాకినట్టు అయింది. భయం వేసింది, చివ్వున లేచి కూర్చుంది.

నో ! నో ! అతను మనిషే ! ఏ దెయ్యమో భూతమో కాదు. అతను తన చేతిని అందుకొన్నాడు. ఆస్పర్శానుభూతి ఇంకా తను అనుభవిస్తూనే ఉన్నది.

నాన్న చెప్పేవాడు ఇండియాలో ఒక గూఢచారి సంస్థ ఉన్నదని, దాని పేరు ద్రిగేట్ గేమ్ అనికూడా చెప్పాడు. అందులో పనిచేసేవాళ్లు చాలా సాహసాలు చేస్తారట. ప్రాణాలను సహితం లెక్కచెయ్యరట, వాళ్ళంతా తమ దేశాన్ని ఎంతో ప్రేమిస్తారట.

ఆదేశభక్తివాళ్ళచేత ఎన్నో సాహసాలు చేయిస్తుందట, ఎందరో తమ ప్రాణాలను పోగొట్టుకున్నారట.

"వాళ్ళకు శత్రువులు ఎవరు డాడీ" తను తండ్రిని అడిగింది.

"ప్రస్తుతం రిష్యావాళ్లు, వాళ్ల సైనికులు నార్త్‌వెస్టు ఫ్రాంటియర్‌లో మన వాళ్ళమీద దౌర్జన్యాలు జరుపుతూ ఉంటారు." తన తండ్రి సమాధానం ఇచ్చాడు.

"ఎందుకు వాళ్లు అలా చేస్తున్నారు ?"

"ఇండియా మీద అధికారాన్ని సంపాదించాలని వాళ్ళకు మన మంటే గిట్టదు. ప్రపంచం మీద ఘనకున్న అధికారాలను చూసి వాళ్ళకు ఈర్ష్య. మన అధీనంలో ఉన్న ఇండియాను వాళ్లు తమ హస్తగతం చేసుకొనే ప్రయత్నంలో ఉన్నారు".

తమకు తండ్రి చెప్పిన విషయాలు అర్థం కాలేదు.

"అందుకే వాళ్లు అరాచకాన్ని సృష్టిస్తున్నారు. ఒక కులాన్ని మరో కులం మీదకు పురికొలుపుతున్నారు. ఒక మతం వాళ్ళన మరో మతం వారి మీదకు ఉసి గొలుపుతున్నారు. అందువల్లనే ఇండియాలో మనం ఎన్నో అడ్డంకులను ఎదుర్కొంటున్నాం" తన తండ్రి తనకు తానే చెప్పుకుంటున్నట్టుగా అన్నాడు,

"నువ్వు కూడా ఇండియాలో ఉన్నప్పుడు "ద్రిగేట్ గేమ్ లో ఉన్నావా డాడీ ?" తను కుతూహలంగా అడిగింది.

"లేదు ఆ సంస్థలో ఉన్నా వాళ్ళంతా చాలా తెలివైన వాళ్లు. ఎవరెవరు ఆ సంస్థకు సంబంధించిన వాళ్ళో కూడా తెలియదు, వాళ్ల ఆర్గనైజేషన్ చాలా పకడ్‌బందీగా ఉంటుంది."




"అందులో మన వాళ్ళు కూడా ఉన్నారా డాడీ!"

"గుడ్ హెవెన్స్! మన వాళ్లు లేరు ఇండియన్స్ మాత్రమే ఉంటారు రష్యా అధికారం వస్తే తమ జీవితాలు ఇంకా అధ్వాన్నం అవుతాయని వారి భయం రష్యన్స్ కంటే మనం చాలా బెటర్ అని వాళ్లు గుర్తించారు"

"ఆ సంస్థ గురించి పుస్తకాలు వచ్చాయా?"

"తెలియదు"

తన తండ్రికి ఆ రహస్య సంస్థ గురించి ఎక్కువగా తెలియదని తనకు అర్థం అయింది.

అతను కూడా ఆ రహస్య సంస్థకు సంబంధించినవాడేమో?

ఆ రహస్య సంస్థ గురించి ఎన్నో విషయాలు అతని ద్వారా తెలుసుకోవాలనుకొన్నది సీత, ఇండియా గురించి ఎన్నో విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ఆమెలో అతన్ని చూశాక, అతని మాటలు విన్నాక, రెట్టింపు అయింది.

మిస్టర్ హార్వే ఆలోచనలు వేరుగా ఉన్నాయి ఇండియా చేరగానే సాధారణంగా, ఆడంబరంగా, స్వాగతం లభిస్తుందో లేదోనని ఆలోచన అతన్ని పట్టుకొన్నది.

షిప్ కలకత్తా చేరబోతున్నది. వైస్రాయ్‌కు అక్కడే ఉంటాడని విన్నది సీత.

ఈస్ట్ ఇండియా కంపెనీ పేరుతో ఇండియాలో ప్రవేశించిన ఇంగ్లీషువాళ్లు ఆదేశం మీద ఆధిపత్యం సంపాదించారు

ఇండియాను తమ ఆధీనంలోకి తెచ్చుకోవడంవల్ల ఇంగ్లీషువారి గౌరవ ప్రతిష్టలు పెరిగాయని సీతకు ఆమె తండ్రి చెప్పాడు.

షిప్ కలకత్తా చేరింది.

మిస్టర్ హార్వేకు వైస్రాయ్ ఆతిథ్యం లభించింది.

హార్వే కళ్ళల్లో గర్వం తొంగి చూపింది తన ప్రాముఖ్యాన్ని గుర్తించినందుకు ఆనందంతో ముఖం విప్పారింది, సీత తన బాబాయి అంత సంతోషంగా ఉండటం అంతకు ముందెన్నడూ చూడదు.

మిలటరీ అధికారి వాళ్లను సగౌరవంగా కోచ్‌లో తీసుకెళ్ళాడు. సీతకు అదంతా థ్రిల్లింగ్‌గా ఉంది.

"బాబాయి ఇంత గొప్పవాడా!" అని మనసులో అనేకసార్లు అనుకొన్నది. అంతకుముందు అతని మీద ఏర్పడ్డ ద్వేషం ఇట్టే కరిగిపోయింది.

హార్వేనూ, అతనికి శాల్యూట్ చేసిన సైనికాధికారినీ ఏదో అద్భుతమైన సినిమాను చూసినట్టు చూసింది

కలకత్తా బజార్లు ఇరుగ్గా ఉన్నాయి జనంతో కిటకిటలాడుతున్నాయి ఇండియన్స్ ధరించిన రకరకాల దుస్తుల్ని చూస్తూ కూర్చుంది సీత కోచ్‌లో.

రోడ్డు ప్రక్కన చిరిగిన బట్టల్లో, అర్ధనగ్నంగా మురికిగా ఉన్న వాళ్ళను చూసి ఆశ్చర్యపోయింది, వాళ్లు అక్కడే ఉంటున్నారు కొందరు పడుకొని ఉన్నారు. కొందరు గిన్నెలు కడుక్కొంటున్నారు. స్త్రీలు మూడు రాళ్లు పెట్టిన పొయ్యి మీద వంటలు చేసుకొంటున్నారు. నగ్నంగా ఉన్న పిల్లలు దుమ్ముకొట్టుకొని ఉన్నారు.

సీత తమ కోచ్‌లో కూర్చుని ఉన్న ఇంగ్లీషు సైనికాధికారుల్నీ, రోడ్డు పక్కన జీవిస్తున్న భారతీయుల్నీ మార్చిమార్చి చూసింది.



# ఒలింపిక్ కోచ్ జిమ్ ఐ డోహర్టీ అంటారుగదా:

# "బలం, చేవా సమకూర్చడానికి కాంప్లాన్ లాంటిది మరొకటి లేదు మరి."

ఒలింపియన్ జిమ్ ఓ డోహర్టీ, జటిలమైన పోటీ పందేలకోసం, భారతదేశంలోనే గాక ప్రపంచమంతటా, ఉత్సాహంగల యువతరం వారికి తర్ఫీదు యిచ్చారు. ఛాంపియను పుట్టుకతో అవరు, తర్ఫీదు యిచ్చి తయారుచేయాలి వారిని అని ఆయన నమ్మకం. మరి విజేత అవడానికి కావలసినది మనో శక్తి—దాంతోటే శరీర శక్తీను.

"ఆటగాళ్ళకి, ఎథలెట్స్‌కి, ముఖ్యంగా, పెరిగే వయస్సులో పిల్లలకి కాంప్లాన్ తీసుకోమని సిఫార్సు చేస్తాను," అంటారు. జిమ్ ఓ డోహర్టీ. "కాంప్లాన్, ఆ చేవను సమకూర్చడంకోసం ఆరోగ్యవంతమైన పెరుగుదల నిచ్చే, తేలికగా అరగగల, 23 కీలక పదార్థాలున్న సంపూర్ణ ఆహారం."

ఈ కిటుకును జిమ్ ఓ డోహర్టీ నుంచి తెలుసుకోండి. మీ పిల్లలకు, పూర్తిగా ఆరోగ్యవంతమైన పెరుగుదలకోసం, ప్రతి రోజూ యివ్వండి కాంప్లాన్. కాంప్లాన్ రుచికరమైన సువాసనల్లో వస్తుంది—పిల్లలకిది ఎంతో యిష్టం!




OLC.S.1610 TEL.

# కాంప్లాన్ - సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

కోచ్ ఒక పెద్ద బంగళా ముందు ఆగింది. అది మార్క్వెస్ వెల్లస్లీ కట్టించాడు. అంతకు ముందున్న గవర్నమెంటు భవనం తను ఉండటానికి యోగ్యంగా లేనందువల్లనే శతాబ్దం క్రితం అతను ఈ బంగళాను, అన్ని హంగులతో కట్టించాడు.

ఈ విషయం హార్వే సీతకు చెప్పాడు.

సీతకు తన బాబాయి ప్రవర్తన ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కూడా కలిగించింది. తనతో ఇలాంటి విషయాలు చెప్పడం ఆమెకు వింతగా తోచింది.

బాబాయి చాలా సంతోషంగా ఉన్నాడు. తన గొప్పతనం ఎవరికో ఒకరికి చెప్పుకోవాలి. అందుకే అతను సీతతో చెప్పాడు.

చెబుతున్నది తనకే అయినా, ఆ విషయాలు ఎదురుగా కూర్చున్న ఆ సైనికాధికారి వినాలని చెబుతున్నట్టు సీతకు అర్థం కావడానికి ఎంతో సేపు పట్టలేదు.

"ఈ భవంతి కట్టడానికి నాలుగేళ్ళు పట్టింది." సైనికాధికారి అన్నాడు.

సీత ఆ బంగళాను ఊపిరి పీల్చడం మర్చిపోయినట్టు చూడసాగింది. పల్లెటూరి పిల్ల నోరు తెరచుకొని ఏదైనా అద్భుత వస్తువును చూసినట్టు సీతగా ఆ బంగళాను చూస్తున్నది.

గేటుమీద రెండువైపులా సింహాల బొమ్మలు ఉన్నవి. అవి సజీవంగా ఉన్నాయా అన్నంత భ్రమను కలుగ జేస్తున్నాయి.

"ఇంత పెద్ద భవంతిలో ఒక్క కుటుంబమే ఉంటుందా!"

సీత ఆశ్చర్యంగా అనుకొన్నది.

సీత ఆ బంగళాలో అడుగు పెట్టింది. ఆమెకు ఏదో కొత్త ప్రపంచంలో ప్రవేశించినట్టుగా ఉన్నది. అంత అందంగా అలంకరించబడిన అంత పెద్ద భవంతిని ఆమె ఎన్నడూ చూడలేదు. ఆ వైభవం ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసింది.

ఆ పాలరాతి గోడల మీద ఉన్న పెద్ద పెద్ద చిత్రాలనూ, అద్దాలనూ చూస్తూ నిల్చుండిపోయింది. ఆ హాలులో ఉన్న ఫర్నిచర్ మహారాజుల కోటల్లో మాత్రమే ఉంటాయని సీత అంతకుముందు ఊహించుకొంటూ ఉండేది. అద్దాలు




బర్మా రాజప్రాసాదం నుంచి తెచ్చినవి. ఆ వైభవాన్ని సదా గుర్తుంచుకో గలిగేదాకా చూడాలని ఉన్నది. అద్భుతమైన అనుభూతి ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది తను తనేనా? తనకు అదృష్టం కలిగిందా?

సీతను ఆ మార్బుల్ హాలునుంచి గెస్టురూములవైపు తీసుకెళ్ళారు. ఆ హాల్లో ఉన్న నున్నటి, తెల్లటి పాలరాతి స్తంభాలను తాకుతూ, వాటితాలుకు స్పర్శకు మనసు పులకరించి పోతూ ఉండగా, సీత చుట్టూ ప్రపంచాన్ని మరిచి పోయి నడుస్తున్నది. ఆమెకు దారి చూపుతున్న నౌకరు వెనక యాంత్రికంగా నడుస్తున్నా, ఆమెకు ఇంకొంతసేపు ఆ హాల్లో ఉండాలని ఉన్నది ఆ నున్నగా చల్లగా తగులుతున్న స్తంభాలకు చేరబడి నిల్చోవాలని ఉంది

"రెండేళ్ళయింది ఈ దేశం వదిలి. అయినా వీళ్ళు నన్ను మర్చిపోలేదు." ఎంతో సంతృప్తితో అన్నాడు హార్వే

సీత తృళ్ళిపడి పక్కకు చూసింది అంతవరకూ తన బాబాయి తన పక్కనే ఉన్నాడనే విషయం కూడా ఆమెకు స్ఫురించలేదు,

సీత ముఖంలోకి చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

తన బాబాయి ఆనందంగా నవ్వగలడని మొదటిసారిగా తోచింది సీతకు.

బాబాయికి ఇక్కడ లభించిన స్వాగతం ఎంతో సంతృప్తిగా ఉన్నది. ఆతని ముఖంలో తనకు ఇంత కాలంగా తెలిసిన కాఠిన్యం లేదు, రాక్షసుడుగా కన్పించిన తన బాబాయి ఒక్కసారిగా మనిషి అయ్యాడు

వైస్రాయ్ దంపతులతో భోజనానికి కూర్చున్నప్పుడు సీత, తనలో ఉబుకు తున్న ఉత్సాహాన్నీ ఆనందాన్నీ అణుచుకొనే ప్రయత్నంలో సతమతమైపోతున్నది ఆమె చిన్న పిల్లలా కేరింతలు కొట్టాలని ఉంది. మనసులో ఇమడలేని ఆ ఉద్వేగాన్ని ఆడీ, పాడీ, గంతులేసి బయట పెట్టాలని ఉంది. అవేమీ చెయ్యలేదు. కనీసం తనతో మాట్లాడేవాళ్ళు కూడాకన్పించలేద. హార్వే పక్కన కూర్చుంది. వైస్రాయ్ దంపతులతో పాటు, కొంతమంది పెద్దపెద్ద ఆఫీసర్లుకూడా డైనింగ్ టేబుల్‌ముందు కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు.

సీత మౌనంగా వింటున్నది

వాళ్ళ సంభాషణను బట్టి తన బాబాయిని వాళ్ళు ప్రత్యేకమైన పనిమీద ఇక్కడకు పంపించారని అర్థం చేసుకొన్నది.

హార్వే ముఖం ప్రసన్నంగా ఉంది.

కళ్ళు ఆనందంతో మిల మిల లాడుతున్నాయి.

కంఠం స్వరంలో అణకువ ఉన్నది.

సీత తన బాబాయిని కొత్త వ్యక్తిని చూస్తున్నట్లు చూడసాగింది

బాబాయి మారిపోయాడు, ఇక్కడి ఉన్నంతకాలం తనను బాగా చూస్తాడు. తనను తిట్టడు కొట్టడు ఎంతకాలం ఇక్కడ ఉంటాడో?

తన బాబాయిని అంతమంది గౌరవిస్తుంటే సీతకు కూడా గర్వంగా ఉన్నది బాబాయితో పాటు తనకూ ఆ గౌరవంలో భాగం ఉన్నట్టుగా తోచింది.

"వైస్రాయ్ నా బుర్ర తినేస్తున్నాడు."

సీత చివ్వున తలతిప్పి బాబాయి ముఖంలోకి కుతూహలంగా చూసింది.

లార్డ్ రిప్పన్ ఒక బిల్లును పాస్సుచేయించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆబిల్లు ప్రకారం ఇండియన్ జడ్జి ఇంగ్లీషువాళ్ళ కేసులు తీసుకోవచ్చును. ఇంగ్లీషు

వాడిని కోర్టులో నిలబెట్టి ఇండియన్ జడ్జి ట్రయల్ చెయ్యడం యూరోపియన్లకు ఇష్టంలేదు ఆ విషయం మీద పెద్ద అలజడి బయలుదేరింది

ప్రభువుల్ని బానిసలు ట్రయల్ కోర్టులో నిలబెట్టటమా? శిక్షించటమా? ఇండియాలో ఉన్న యూరోపియన్స్ అందరూ ఏకగ్రీవంగా ఈ బిల్లు వ్యతిరేకించారు ఆ సంబంధంగానే వైస్రాయ్ హార్వేను ఇండియాకు పిలిపించాడు. హార్వే ఈ విషయాల్లో ఆరితేరిన ఘటం లా పాయింట్సు క్షుణ్ణంగా తెలిసిన వాడు

హైదరాబాద్ వెళ్ళకు ముందే వైస్రాయ్ మిస్టర్ హార్వేతో అన్ని విషయాలు చర్చించాలని భావించాడు అతని సహకారం అర్థించడానికే ఇంతగొప్ప సత్కారం హార్వేకి ఇవ్వడం జరిగింది

---

కారణం ఏమైనా సీతకు ఆ బంగళా ఎంతో నచ్చింది అక్కడ ఉండటం వైస్రాయ్ దంపతులతో డిన్నర్ చెయ్యడం జీవితంలో మరిచిపోలేని ఒక అపూర్వ అనుభవంగా భావించింది.

కింద నేల నిగనిగలాడే నల్లరాళ్లు పరచి ఉన్నది. ఆ రాళ్లలో నీడల కన్పిస్తున్నాయి సీత వాటిమీద అతి జాగ్రత్తగా నడుస్తోంది తను నడిస్తే అవి మురిగ్గా అయిపోతాయేమో నన్నట్టుగా కాళ్లు పెడుతున్నది.

ఆమె కు పేటాయించిన గదిని చూపడానికి ఒక సైనికుడు ముందు నడుస్తు న్నాడు

"ఇదే వైస్రాయ్ కూర్చునే సింహాసనం" అన్నాడు సైన్యాధికారి.

సీతకళ్ళు పెద్దవి చేసుకొని చూడసాగింది

ఆ సింహాసనం అంతా బంగారు పూత పేసి పున్నది. దానిమీద పరచిన ఎఱ్ఱ బంగారు జరీ ముద్దలా ఉంది.

వైస్రాయ్‌కి కూడా ఇంతమంచి సింహాసనం ఉంటుందా?" ఆమె ఆశ్చర్యంగా అడిగింది సీత

"అవును మన ఇంగ్లండు రాజుగారి ప్రతినిధి వైస్రాయ్ ఈ దేశానికి అతనే పెద్ద" అన్నాడు సైనికాధికారి

"చాలా బాగుంది "

"ఏమిటి?"

"ఈ బంగళా - ఈ సింహాసనం."

"బంగళాలో కొన్ని ఇబ్బందులున్నాయి వసతులు తక్కువే "

సీత అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

"కిచెన్ కనీసం బంగళా బయట ఉన్నా దగ్గరగా ఉంటే బాగుండేది వైస్రాయ్‌గారి భార్య కిచెన్ కలకత్తాలో - మనం ఊరు చివర - అంటూ ఉంటారు." అన్నాడు.

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు

**మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు.**

నిజానికి ఆ తేడా మీ కళ్లే మీకు తేల్చి చూపిస్తాయి. మరి సూపర్ రిన్‌తో ఉతికిన బట్టలకి, మరే యితర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కన్నా కొట్టొచ్చేలాంటి ఆ మరింత తెల్లని తెలుపు వస్తుంది. కారణం ఏమిటంటే, సూపర్ రిన్‌లో మరింతగా తెలుపు చేసే శక్తి ఉంది. మీ బట్టలకి ఎంత తెలుపు వస్తుందంటే చూసేవాళ్ళ కళ్ళు మిరిమిట్లు గొలుపుతాయిక.



భోజన పదార్థాలు చెక్కపెట్టెల్లో పెట్టుకొని వంటవాళ్ళు, పనివాళ్ళు, మోసుకొని రావడం సీత చూసింది.

సీత తనకు కేటాయించిన గెస్టురూంలోకి వచ్చింది. అదికూడా ఎంతో విశాలంగా ఉన్నది. పాతకాలపు అద్దాలతో, చిత్రాలతో గోడలు నిండిఉన్నాయి. సీత ముఖం ఆనందంతో విప్పారింది.

స్నానానికి నీళ్ళు కావాలని అడిగింది.

వెంటనే ఒకడు నీళ్ళ వేడి చేశాడు.

మరొకడు బాత్‌రూంలో నీళ్ళు పెట్టాడు.



శ్రీ నార్ల తాతారావుకి పద్మశ్రీ వచ్చిన సందర్భంగా. శ్రీ యీడ్పుగంటి లక్ష్మణరావు విజయవాడలో జరిపిన అభినందన సభాదృశ్యం. శ్రీయుతులు బొబ్బా రామమోహనరావు, టి వెంకటేశ్వరరావు, యీడ్పుగంటి లక్ష్మణరావు, కె. రాజారామమోహనరావు, సుందర సత్యనారాయణ, కొటగడ్డ మధుసూదనరావు

మూడోవాడు నీళ్లు కలిపి పెట్టాడు.

ఆమె స్నానం చేసింది.

తర్వాత మరొకడు వచ్చి బాత్‌రూం శుభ్రం చేశాడు.

తనకు గైడ్‌గా ఉన్న అతన్ని ఈ చిన్నపాటి పనికి నలుగురెందుకని ఆశ్చర్యంగా అడిగింది సీత.

"అందరూ వేరు వేరు కులాల వాళ్లు". అన్నాడు ఆ సైనికుడు.

సీతకు అతను చెప్పింది అర్థం కాలేదు.

గది అందంగా అలంకరించి ఉన్నది. కాని అందులో వెలుగు మాత్రం సరిగాలేదు. పొగ మారిన క్యాండిల్ దీపాలు అక్కడ కూడా పెట్టి ఉన్నాయి.

---



ప్రజా చిత్ర ప్రొడక్షన్స్ వారి "విముక్తి కోసం" చిత్రాన్ని దర్శకులు ఉదయకుమార్ మహాకవి శ్రీశ్రీకి అంకితమిస్తున్నారు....

ఈ విషయంలో లార్డ్ రిప్లన్ ఎందుకు శ్రద్ధ తీసుకోలేదో ?

ఇలాంటి చిన్న విషయాలను పట్టించుకోవడానికి ఆయనకు సమయం ఎక్కడుంటుంది ?

తన ప్రశ్నకు తానే సమాధానం చెప్పుకొన్నది సీత

డ్రాయింగ్ రూంలో వైస్రాయ్ దంపతులు కూర్చొని ఉన్నారు. అనేక మంది వారిని చూడటానికి వస్తున్నారు. తలలు వంచి తమ అభివాదం తెలిపి కూర్చుంటున్నారు. స్త్రీలు మరీ అణకువగా కన్పిస్తున్నారు.

అందరూ డిన్నర్ టేబుల్ ముందు కూర్చున్నారు

ప్రతి కుర్చీ వెనకా, తెలుపూ, ఎరుపూ కలిసిన దుస్తుల్లో చక్కగా అలంకరించుకొన్న సిపాయిలు నిల్చున్నారు.

ఏదో జంతువు అరిచినట్లు విన్పించింది.

సీత తలెత్తి చూసింది. ఎవరూ ఆ అరుపును పట్టించుకున్నట్టుగా అన్పించలేదు. ఆమె పక్కన కూర్చున్న యువకుడు "నక్క అరుస్తోంది. ఈ బంగళా చుట్టూ పెద్ద ఖాళీ స్థలం ఉంది. చిన్నపాటి అరణ్యంలా ఉంటుంది. రాత్రిళ్ల నక్కలో, గుంటనక్కలూ, తోడేళ్ళూ తిరుగుతూ ఉంటాయి

"ఇంకా ఏముంటాయ్ ?" సీత చిన్నగా, బిడియపడుతూ అడిగింది.

"పిల్లులు . .ఇండియాలో పిల్లులు ఎక్కువగా ఉంటాయి. పెద్దపెద్ద గండు పిల్లులు ఉంటాయి. అవి చెట్లు ఎక్కి అరుస్తుంటాయి. ఒక్కోసారి కిటికీలో నుంచి గదుల్లోకి వస్తాయి. ఒకసారి ఒక గండు పిల్లి నా భార్య గదిలోకి కిటికీలో నుంచి దూకింది. నా భార్య భయంతో చూస్తూ కూర్చుంది. అది అక్కడ ఉన్న పాలన్నీ తాగి నాలుకతో మూతి తుడుచుకొంటూ బయటికి వెళ్ళిపోయింది. మళ్ళీ కిటికీ నుంచే...." అదేదో అద్భుతమైన విషయం చెప్పినట్లు చెప్పాడు.

సీత కూడా తానేదో విచిత్రమైన కథ వింటున్నట్టే చెవులు రిక్కించి, కళ్ళు పెద్దవి చేసి విన్నది.

ఆమెకు ఇండియా అంతా పిల్లులతో, నక్కలతో నిండిపోయినట్టుగా అన్పించింది

(సశేషం)

I like you

# ఇప్పుడు మీరు ప్రత్యేక జనరంజని వింటారు!




## యర్రంశెట్టి శాయి హ్యూమరాలజీ-7

శంకర్రావ్‌ని అందరూ తెగ అభినందించేస్తున్నారు

"ఒరేయ్! అందరిలాగా కాకుండా మంచి రికార్డ్స్ వేయరా! పాత సినిమాల్లో చాలా మంచిపాటలున్నాయిగా అవన్నీ వెయ్-" అన్నాడు చంద్రం

"చూస్తావ్‌కదురా! బెస్ట్ రికార్డ్స్ సెలెక్ట్‌చేసి వేస్తాను." అన్నాడు శంకర్రావ్ గర్వంగా.

"అందమె ఆనందం- ఆనందమె జీవిత మకరందం" పాట మర్చిపోక రేయ్-" హెచ్చరించాడు లక్ష్మణరావు.

"ఆపాట ఎలా మర్చిపోతాను బాబాయ్-"

సాయంత్రం వరకూ ఆఫీస్‌లో స్టాఫంతా శంకర్రావు వివిధభారతి ద్వారా ప్రత్యేక జనరంజని కార్యక్రమం గురించే ముచ్చటించుకుంటూ గడిపారు. శంకర్రావు కథలూ నాటికలూ రాస్తూంటాడని ఆఫీస్‌లో అందరికి తెలుసు, అతను రాసిన ఓ కథ "కాకర పాటిం కుర్రోడు" అనే సినిమాగా కూడా తీశారు. రేడియో స్టేషన్ వాళ్ళకు శంకర్రావు రచయిత అని తెలీదు అసలు వాళ్ళ దృష్టిలో రచయితలు వేరు వాళ్ళెవరూ పత్రికలో కథలు రాయరు రచయిత అంటే మాగజైన్స్‌లో రచనలు చేయాలని ఎక్కడయినా రూలుందా అని వాళ్ళ ప్రశ్న. కేవలం రేడియోకి వ్రాసే వాళ్ళే రచయితలు. కేవలం రేడియోలో నటించే వారే నటులు అని వాళ్ళనుకుంటూంటారు ఎప్పుడయినా అడపా దడపా ఇదిగో ఇలా శంకర్రావులా సినిమాకి కథ వ్రాసిన రచయితలను కూడా వాళ్ళు రచయితలుగా గుర్తిస్తుంటారు.

శంకర్రావు వారం రోజులపాటు తను జనరంజని శ్రోతలతో ఏం మాట్లాడాలి, ఎలా మాట్లాడాలీ అన్నది నానా హైరాన పడి నిర్ణయించుకున్నాడు. ఆ తర్వాత తన మాట్లాడే మాటలకు పొంతన కుదిరేలా మంచి పాటలు ఎన్నుకుని లిస్ట్ తయారు చేసుకున్నాడు.

రికార్డింగ్ రోజున ఓ గంటముందే బయల్దేరి ప్రతిభాదేవి ఇంటికి చేరుకున్నాడు.

ప్రతిభాదేవి అతని కథలు చదివి, అతనిని తెగప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకుంటున్న అమ్మాయి. (ఆపిల్ల తెలుగు మీడియం స్టూడెంటు అని గమనించ ప్రార్థన)

"ఏమిటి? వారం రోజుల్నుంచి కనిపించటంలేదు? ఊరెళ్ళారా?" అడిగిందావిడ ఆశ్చర్యంగా.

"నేను ప్రత్యేక జనరంజని ప్రోగ్రాం ఇస్తున్నానండి! అందుకని పాటలు వగైరా రెడీ చేసుకోవడంలో కొంచెం బిజీగా ఉన్నాను...."




"వావ్! మీరు ప్రత్యేకరంజని ఇస్తున్నారా? అబ్బ మరి నాకిష్టమయిన పాటలు వేస్తున్నారా"

"ఓ! అన్నీ మీరు లైక్ చేసేవే"

"అబ్బ మరి నాకు అప్పుడే చెప్పలేదేం?"

"ఒక్కసారిగా సర్ప్రైజ్ చేద్దామని."

"చిగురాకులలో చిలకమ్మా" తప్పక వేస్తారు కదూ?"

"ఎలాంటి అనుమానం లేకుండా"

"థాంక్యూ ప్రియా."

"ఓ ... రికార్డ్ కూడా వేస్తున్నానండీ."

ఆమె అతని భుజంమీద కొట్టింది నవ్వుతూ

"అది నేను మీకు చెప్తున్నానండీ 'థాంక్యూ ప్రియా' అన్నది రికార్డేమి లేద"

శంకర్రావు తన తప్పుకి నాలిక్కరుచుకోబోయి, కరుచుకోలే

"సారీ! అదేమో లేటెస్ట్ పాటేమో అనుకున్నాను, చూడండి మీకిష్ట మయిన పాటలన్నీ వేస్తాను. ఎందుకంటే అవి మనిద్దరికీ ఇష్టమైనవే కద

ఆమెకు టాటా చెప్పి రేడియోస్టేషన్ చేరుకున్నాడతను

వివిధభారతి ఆఫీస్‌లో ఒకావిడ కూర్చుని టేబుల్ మీదున్న ట్రాన్సిస్టర్లో పాటలు వింటోంది.

"చూడండి! నన్నివాళ రికార్డింగ్‌కి రమ్మని చెప్పారు...."

ఆమె విసుగ్గా అతని వంక చూసింది. ట్రాన్సిస్టర్‌లో "సోగ్గాడే చిన్ని నాయన-ఒక్క పిట్టనైన కొట్టలేడు సోగ్గాడే" అన్నపాట గట్టిగా వినబడుతోంది.

"ఏమంటునారు?"

"ఇవాళ నా రికార్డింగ్ ఉంది." "సోగ్గాడే చిన్నినాయన ఒక్క పిట్టనైన కొట్టలేడు సోగ్గాడే-"

"ఏమంటున్నారు?" మళ్ళీ అడిగిందామె.

"ఆ ట్రాన్సిస్టర్ సౌండ్ కొంచెం తగ్గిస్తే ..." "సోగ్గాడే చిన్ని నాయన" ఆమె సౌండ్ తగ్గించింది.

"ఇవాళ నా రికార్డింగ్ ఉందండీ!"

"రికార్డింగా ?"

"అవునండీ!"

"'యువవాణి' ప్రోగ్రామా ?" అనుమానంగా అడిగింది

"కాదండీ! జనరంజని-"

"జనరంజనా ?" ఆశ్చర్యంగా అడిగింది,

"అవునండీ! నాపేరు శంకర్రావు!"

"శంకర్రావు మీపేరు కావచ్చుగాని జనరంజని అంటారేమిటి ?"

"నేను జనరంజని ప్రోగ్రాం ఇస్తున్నానండీ ఈసారి! స్పెషల్ జనరంజని"

"మీరిస్తున్నారా?"

"అవునండీ"

"ఎవరిమ్మన్నారు మిమ్మల్ని?"

"మీరేనండీ...."

"నేనా ?"

"మీరంటే మీరు కాదండీ! మీ వివిధభారతివాళ్ళన్న మాటండీ...."

"మిమ్మల్ని ఇమ్మన్నారా ?"

"అవునండి నేను రచయితను."

"మీరు రచయితా?" ఇంకా ఆశ్చర్యపోతూ అందామె.

"అవునండీ! కాకరపాలెం కుర్రోడు సినిమా నాకథే!"

"నిజంగా?"

"నిజమండీ! కావాలంటే ఎవర్నయినా అడగండి!"

"అయితే అలా చూస్తారేంటండీ! మీ రికార్డింగ్ ఉన్నట్లు నాకెవ్వరూ చెప్పలేదు. ఇప్పుడే కనుక్కుంటాను." అంటూ ఎక్కడికో ఫోన్ చేసిందామె

"ఎంగేజ్డ్" అంది అతని వంక చూసి చిరాగ్గా

"అవునండీ ఈ ఫోన్లెప్పుడూ ఎంగేజ్ ఉంటయ్." మర్యాదకోసం అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు.

మళ్ళీ డయల్ చేసి రెండు చేతుల్తో తలపట్టుకుని "ప్చ్" అంది. మధ్యలో ట్రాన్సిస్టర్ సౌండ్ కొంచెం పెంచింది. పాట తక్కువ అందుకుంది.

"ఆడ నీవు ఈడ నేనూ చూసుకుంటూ కూరుచుంటే ఎన్నాళ్ళు తాళగలను చందమామా, ఎన్నాళ్ళు దాచగలను చందమామా"

సౌండ్ మళ్ళీ తగ్గించేసిందామె.

మరోసారి డయల్ చేసింది. "హు" అందిసారి రిసీవర్ విసిరేలా ఫోన్ కేసి కొడుతూ.

"ఒక్క నిమిషం. ఇప్పుడే వస్తాను." అని లేచి బయటికెళ్ళి పది నిమిషాల తర్వాత తిరిగి వచ్చింది.

"మీరు మాట్లాడదలచుకున్న పేపర్ తెచ్చారా?" అడిగిందామె

ఓ ఇదిగో." కాగితాలు ఆమె కిచ్చాడు. కుర్చీలో కూర్చుని అంతా చదివేసింది

"ఇక్కడ 'క' కింద 'త' వత్తు ఇవ్వడం మర్చిపోయారు." అంది ఓ చోట అతనికి చూపుతూ.

"మీరు 'క' కింద 'క' వత్తు మానకపోతే చాలా గొడవయిపోయేది. నేను మామూలుగా వత్తులేకుండా చదివేసేవాడిని దాంతో అర్థం మారిపోయేది.

ఆ తరువాత దానికింద ఏ వత్తు ఇచ్చినా లాభం ఉండదు కదా! 'క' కింద 'క' వత్తు ఉంచేనే గాని . ."

ఆ తరువాత ఏమనాలో తెలీక ఆగిపోయాడు శంకర్రావు

ఆమె చాలా సంతోషించినట్లు మొఖంలో తెలిసిపోతోంది.

"కిందటిసారి కూడా ప్రత్యేక జనరంజని స్క్రిప్ట్‌లో ఇలాగే 'ర' కింద 'ర' వత్తు ఇవ్వడం మర్చిపోయారండీ ఒకాయన. . ."

"అబ్బ 'ర' కింద 'ర' వత్తే? ఎంత డేంజరస్ !"

ఆమె లేచి నిలబడింది మళ్ళీ.

"స్టూడియో ఖాళీగా ఉందేమో చూసి వస్తాను." అంటూ లోపలికెళ్ళి పావు గంట తర్వాత తిరిగి వచ్చింది

"అన్నీ ఫుల్ ఉన్నాయండీ! అసలు మీకివాళ రికార్డింగ్ ఉందని ముందే తెలిస్తే స్టూడియో బుక్ చేయడం జరిగేది- కానీ నాకు ఇన్‌ఫర్మేషన్ లేదు."

"మీరిప్పుడేం చేద్దామంటారండీ?"

"ఒక రికార్డింగ్ మాత్రం ఓ అరగంటలో పూర్తవుతుందండి ఆ తర్వాత చేస్తాను పోనీ-"

"సరే! '

"మీరు సెలక్ట్ చేసిన పాటల లిస్ట్ ఉందా?"

లిస్ట్ తీసి ఆమె ముందుంచాడతను.

ఆమె లిస్టు చూస్తూనే రక్కున తలెత్తి శంకర్రావు వంక చూసింది.

"మొదటి పాట అందమె ఆనందం వేస్తున్నారా?" ఆనందంగా అడిగింది

"అవునండీ. ఆ పాటంటే నాకెంతో ఇష్టం "

"నాకూ ఎంతో ఇష్టమండీ చాలా మంచి పాట అది."

"అలాగ లిరిక్ కూడా చాలా బావుంటుందండి."

"కానీ ఆ రికార్డు మరీ పాతది కదండీ- మా దగ్గర ఉండదు."

"ఉండదా?" ఆశ్చర్యంగా అన్నాడు శంకర్రావు.

"ఉండదండి. మరీ పాత రికార్డులు ఉండవు."

"అదేమిటి ? ఇంత పెద్ద రేడియో స్టేషన్‌లో అంత మంచి రికార్డులు ఉండవా ?""




"ఉండవు?"

ఆమె మళ్ళీ లిస్టు చూసింది.

"ఇదిగో ఈ రెండో రికార్డు కూడా ఉండదు."

"అది శభాష్‌రాముడులోదండీ. మరీ అంత పాతదేం కాదుగా?"

"అయినా కూడా కష్టమండీ దొరకదు."

"అయ్యో ఎలాగండీ మరి?"

"ఎలాగోలా ఎడ్జస్టు అవాలండీ. చాలా పాత పాటలు మాదగ్గర ఉండవు. ఇదిగో "చిగురాకులలో చిలకమ్మా" రాశారు చూశారా, ఇదీ ఉండదు."

"అదేటంటండీ. ఇది చాలా ఫేమస్ సాంగ్ కదా. దొంగరాముడు లోది"

"మేము అందరూ ఎక్కువగా కోరే పాట కాబట్టే ఇది అసలుండదండీ. ఉన్నది పూర్తిగా అరిగిపోయి ఉంటుంది.."

అప్పుడే ఒకాయన రెండు టేప్స్ తీసుకుని వచ్చాడక్కడికి

"ఏమిటి అరిగిపోయింది?" అడిగాడు చిరునవ్వుతో.

"దొంగరాముడులోని పాటండీ చిగురాకులలో చిలకమ్మా-"

"యెవరన్నారు అది అరిగిపోయిందనీ?" అడిగాడతను.

"నేనే అంటున్నాను. అసలది మనదగ్గర లేదనుకుంటాను."

"అలా అనుకోకండి, ఉంది."

"ఉందా?"

"అవును మొన్నే నేను జనరంజనిలో చేరాను. ఫస్ట్‌క్లాస్‌గా ఉంది రికార్డ్."

"అరగలేదా?" అడిగిందామె

"కొంచెం కూడా అరగలేదు." అనేసి అతను టేప్ అల్మారాలో ఉంచి వెళ్ళిపోయాడు.

"పోనీ ఓ పని చేస్తే బాగుంటుందండీ. మీదగ్గరున్న పాటల లిస్ట్ నాకిస్తే అందులో ఉన్నవే సెలెక్ట్ చేసుకుంటాను."

"లిస్టా? లిస్టేమిటి?"

"లిస్ట్ అంటే అదేనండీ, రికార్డ్‌లిస్ట్"

"అలాంటివేమీ ఉండవండీ ఇక్కడ" చిరాకుగా అందామె

"మరి మాకెలా తెలుస్తుందండీ-ఫలానా పాట ఉందో లేదో"

"మీరు రాసిచ్చి వెళ్ళిపోండి ఉంటే వేస్తాం లేపోతేలేదు."

శంకర్రావుకు క్షణం మతి పోయింది.

"స్టూడియో ఖాళీ అయిందేమో చూసొస్తానుండండి'' అంటూ వెళ్ళి కాసేపటి తర్వాత తిరిగి వచ్చింది.

"రండి స్టూడియో ఖాళీ ఉంది...."

శంకర్రావు లేచివెళ్ళి రూమ్‌లో మైక్‌ముందు కూర్చున్నాడు.

"ఒసారి చదవండి సౌండ్ ఎడ్జస్ట్ చేస్తాను" -అందామె రికార్డింగ్ రూమ్‌లో నుంచి.

శంకర్రావు రెండు లైన్లు చదివాడు.

"ఆగండి కొంచెం డిస్టర్బెన్స్ వస్తోంది-' అంది అతని గదిలో కొచ్చి

"ఏం చేస్తారుమరి?" అడిగాడు శంకర్రావ్.

"టెక్నీషియన్‌ని పిలుచుకొస్తాను-"

వెళ్ళి పావుగంట తర్వాత ఓ వ్యక్తితోపాటు తిరిగివచ్చిందామె.

అతను వచ్చి మైక్‌ను అటూ ఇటూ తిప్పి, దాని నెత్తిమీద రెండుసార్లు లాగి కొట్టాడు.

"ఏదీ ఇప్పుడు మాట్లాడండి చూద్దాం" అన్నాడు అక్కడే నిలబడి.

శంకర్రావ్ మళ్ళీ రెండు లైన్లు చదివాడు.




ఈసారి గొంతు అసలు రావడం లేదని రికార్డింగ్ రూమ్‌లో నుంచి ఆమె సైగ జేసింది

అతను మళ్ళా మైక్‌ని ఓ తన్ను తన్నాడు.

"ఇప్పుడు మాట్లాడండి చూద్దాం"

శంకర్రావు మళ్ళీ రెండు లైన్లు చదివాడు. ఆమె అద్దంలోనుంచి తల అడ్డంగా తిప్పింది

అతను తివాచీ కింద ఉన్న ఓ అర తెరిచి అందులోని రెండు వైర్ కనెక్షన్లను తారుమారు చేశాడు, తరువాత మైక్ నెత్తిమీద మళ్ళీ రెండు కొట్టి "ఇప్పుడు మాట్లాడండి" అన్నాడు.

శంకర్రావ్ మళ్ళా రెండు లైన్లు చదివాడు

ఆమె లాభం లేదన్నట్లుగా అద్దంలోనుంచి చేయి ఊపింది.

అతను వెళ్ళి మరో టెక్నీషియన్‌ని తీసుకొచ్చాడు. ఇద్దరూ కలిసి అర గంటసేపు పరీక్షలుచేసి శంకర్రావుతో మొదటి రెండు లైన్లు మరో పదకొండు సార్లు చదివించి చివరకు ఆ మైక్ రికార్డింగ్‌కి అనర్హం అని తేల్చారు.

"ఇంకో యూనిట్ ప్రయత్నిద్దాం పదండి" అందామె శంకర్రావు దగ్గర కొచ్చి. అందరూ కలిసి పక్కనే ఉన్న మరో గదిలోకెళ్ళారు.

మళ్ళా కథంతా మామూలే. మళ్ళా రిపేర్లు. మైక్ నెత్తిమీద కొట్టడాలు, వైర్లు మార్చడాలు, శంకర్రావు ఇరవై ఆరుసార్లు చదవడాలు షెడ్యూల్ ప్రకారం జరిగిపోయాయ్.

ఆ తరువాత ఇంకో గదిలోకి మారారు.

"ఇలా ఎన్ని గదులున్నాయండీ," బొంగురుపోయిన గొంతుతో, కారిపో తున్న చెమటలు తుడుచుకుంటూ అడిగాడతను. రికార్డింగ్ పరికరాలతోపాటు ఎయిర్ కండిషన్ కూడా అంతంత మాత్రంగానే పనిచేస్తోంది.

"భయపడక్కర్లేదులెండి ఈ యూనిట్ బాగానే ఉన్నట్లుంది-" అందామె,

"పీటిల్లో మరి ఇంతవరకూ జరిగిన రికార్డింగ్‌లు ఎలా జరిగాయండీ?" అనుమానంగా అడిగాడు శంకర్రావు,

"అవన్నీ కాంగ్రెస్ (ఐ) గవర్నమెంట్‌కి జైకొట్టే చెంచా ప్రోగ్రాములు కదండీ రికార్డింగ్ క్వాలిటీ ఎలా వున్నా ఫరవాలేదు ఎందుకంటే వినేవారెవరూ ఉండరు. మరి మీ ప్రోగ్రాం అలాకాదు గదా-సినిమాపాటల కోసం మీ మాటలు వినకతప్పదు, విన్నప్పుడు మరి క్వాలిటీ లేకపోతే గొడవచేస్తారు - అందుకే ఈ తిప్పలు-" అందామె.

రికార్డింగ్ ప్రారంభమయింది.

"ఆ ఇది బాగానే ఉందండీ ఇక ప్రారంభిద్దాం మీరు మాట్లాడాక సినిమా పాట రావాల్సిన చోట కొంచెం గాప్ ఇవ్వండి తరువాత ఆ ప్లేస్‌లో పాట డబ్ చేస్తారు-" అందామె,

ఎలాగయితేనేం, రికార్డింగ్ పూర్తయింది.

శంకర్రావు ఈసురోమని లంఖణాలుచేసిన వాడిలా బయటికొచ్చి "బ్రతుకు జీవుడా" అని ఇంటికి బయల్దేరాడు.

o o o o o

"ఆకాశవాణి వివిధ భారతి - వాణిజ్య ప్రసార విభాగం ఈనాటి ప్రత్యేక జనరంజని కార్యక్రమం - ప్రముఖ రచయిత శ్రీ శంకర్రావుగారు సమర్పిస్తు న్నారు". అంది రేడియోలో ఎనౌన్సరు.

శంకర్రావు, అతని స్నేహితులు ప్రతిభాదేవి ఇంట్లో సమావేశమయారు అతని కార్యక్రమం విని ఆనందించడానికి, ప్రతిభాదేవి మరో టూ-ఇన్-వన్‌లో రికార్డింగ్ చేయడానికి 'సిద్ధంగా' ఉంది.

పిళ్ళిద్దరూ యింటికి వచ్చారంటే చాలు నీరసంగా వాలిపోయేవారు...

## మరిప్పుడు గ్లోకీన్-డి యొక్క శక్తి వచ్చిన తర్వాత అంటారా... మరిక చూడండిక!

కొత్త, మెరుగైన గ్లోకిన్-డీ పిళ్ళకి రోజంతటికీ కావలసిన జవజీవాలను యిస్తుంది. గ్లూకోజ్, కాల్షియమ్ ఫాస్ఫేట్లు, దాంతోనే విటమిన్-డీ, వీటియొక్క సత్తువతో నిండిన గ్లోకిన్-డీ, మరి యిప్పుడిక మరింత త్వరగా కరుగుతుంది. ఇక దాంతోబాటే కొత్త, ఆకర్షణీయమైన ప్యాక్‌లో.

**రోజూ గ్లోకిన్-డీ తీసుకోండిక, మరిక చూడండిక!**

**కొత్త, మెరుగైన గ్లోకీన్-డి శక్తినిచ్చేది, రోజంతా!**



మరు క్షణం శంకర్రావు గొంతు నీరసంగా వినబడింది.

"నమస్కారం మీతో గడిపే ఈ అవకాశం దొరకడం నిజంగా నాకెంతో ఆనందంగా ఉంది. ఎందుకంటే—టంగ్‌టంగ్—లక్షాధికారులు కూడా—రెండో బిడ్డను కన్నప్పుడు ఆలోచనలో పడుతున్నారు—"

"మన కూ మాణిక్యాల్లా ముచ్చటగా ముగ్గురున్నారుగా?"

"మన బిడ్డలు మాణిక్యాలే-మట్టిలో మాణిక్యాలు ఒకదేమో కాళ్ళకు చెప్పు లేనా లేకుండా గోళీకాయలాడుతున్నాడు."

"వాడికి చెప్పులు కొంటాన్లేవే"

"రెండోవాడు ఎక్కడెక్కడో తిరిగి ఇప్పుడే ఇంటికి వచ్చాడు.

"వీడికి గోళీకాయలు కొంటాన్లే-"

"ఇక మూడోవాడు ఎండిపోయిన నా శరీరంలోనుంచి రక్తమాంసాలు పీల్చేస్తున్నాడు-"

"అయితే వీడిని ఇన్‌కమ్‌టక్స్ డిపార్ట్‌మెంట్‌లో చేర్పించి - అలానే నేనూ ఇప్పుడే ఆపరేషన్ కూడా చేయించుకొస్తా"

టంగ్-టంగ్-

ప్రతిభాదేవి చిరాగ్గా ఆతనివేపు చూసింది.

"ఛఛ ఈ పాడు గొడవంతా రికార్డయిపోయింది అయినా మాట మధ్యలో ఇదెందుకు ఇరికించనిచ్చావు?".

"బాగుంది నాకేం తెలుసు? అసలు గాప్ కూడా వదల్లేదు నేను-" రక్కన మళ్ళా శంకర్రావు గొంతు వినిపించే సరికి అంతా నిశ్శబ్దం అయి పోయారు.

"—ట్రుప్‌జుక్-లద్వారా మీతో మాట్లాడడం సాధ్యంకాదు కాబట్టి సినిమా పాటలంటే నాకూ ఎంతో ఇష్టం. చిన్నప్పటినుంచీ నేను ప్రేమించే పాట ఒకటుంది. ఆ పాటలో అర్థం ఎంతో అద్భుతంగా ఉంటుంది. అందం అంటే ఆనందమనీ, ఆనందం అంటే జీవిత మకరందం-అనీ-టాంగ్.టాంగ్-

"కాళ్లన్న కుర్రోళ్ళారా, కాలేజి పిల్లోళ్ళారా
క్రోకోడిల్ చెప్పులున్నాయ్ కాళ్లకు క్రోకోడిల్
చెప్పులున్నాయ్




మన్నికధికం-దరలు స్వల్పం

క్రోకోడిల్ చెప్పులున్నాయ్-వాళ్లకు క్రోకోడిల్ చెప్పులున్నాయ్-"

"ఈ పాటేశాపేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు అతని స్నేహితుడు

"ఇది పాట కాదురా వ్యాపార ప్రకటన" విసుగ్గా అన్నాడు శంకర్రావు.

"హోప్‌లెస్-ఈ వెధవ ప్రకటన కొంచెం రికార్డయింది-" అంది ప్రతిభాదేవి రెండు చేతుల్తో తలపెట్టుకుంటూ-మరి రెండు ప్రకటనల తర్వాత హఠాత్తుగా పాట మొదలయింది.

"ఆరేసు కోబోయి పారేసుకున్నాను హరీ-హరీ-హరీ కోకెత్తుకెళ్ళింది కొండ గాలీ-"

అందరూ ఉలిక్కిపడ్డారు.

"ఇదేమిట్రా అందమె ఆనందం పాట అని చెప్పి కొండగాలి కోకెత్తుకెళ్లిందంటా వేమిటి ?" చంద్రం కోపంగా అన్నాడు.

"ఏమోరా నేను అందమె ఆనందం పాట వేయాలనే రాపిచ్చాను మరి-వాళ్ళు ఇదెందుకు వేశారో"- పాలిపోయిన మొఖంతో అన్నాడు శంకర్రావు.

ప్రతిభాదేవి టేప్ చేయడం ఆపేసింది.

"ఈ వెధవ పాట కూడా కొంచెం రికార్డయిపోయింది" అంది ఉక్రోషంగా.

"అసలు నువ్వే ఈ పాట రాసివ్వావేమో" అంది శంకర్రావువేపు అనుమానంగా చూస్తూ.

శంకర్రావుకి కళ్ళు వెంబడి నీళ్లు తిరిగినయ్.

తనను "బాస్టర్డ్" అని తిట్టినా సహించగలడు గానీ ఇలాంటి పాటను తనే సజెస్ట్‌చేశాడనడం మాత్రం సహించలేడు. వెంటనే అక్కడున్న ఫోన్ తీసుకుని వివిధ భారతికి డయల్ చేశాడు.

ఎవరిదో మగ గొంతు వినిపించింది

తన గురించి చెప్పుకున్నాక నేను "ఆందమె ఆనందం పాట రాస్తే- మీరు కోకెత్తుకెళ్ళింది కొండ గాలి వేశారేమిటి ?" అనడిగాడతను.

"అదా! ఆరికార్డ్ దొరకలేదేమో। అందుకని ఇది వేసుంటారు!" అన్నాడతను తేలికగా

"ఎవ ?"

"డబ్బింగ్ చేసినవాళ్ళు?"

"ఎవరా డబ్బింగ్ చేసిన వ్యక్తి?"

"అదెలా తెలుస్తుందండీ! ఎవరుబడితే వాళ్ళే చేస్తుంటారు."

"ఆఅపాట లేనప్పుడు ఊరుకోవాలి గానీ ఈ చెత్తపాట ఎందుకు వేసినట్లు?" కోపంగా అడిగాడు కృష్ణమూర్తి.

"బహుశా ఈ పాట ఆ డబ్బింగ్ చేసినతనికి ఇష్టమైనది అయుంటుంది!" అనేసి ఫోన్ పెట్టేశాడతను.

"ఏమన్నారు?" అడిగింది ప్రమీలాదేవి

"ఏపాటవేయాలి అనేది పాటలు డబ్ చేసేవాళ్ళ ఇష్టం మీద ఆధారపడి ఉంటుందట-" నీరసంగా అన్నాడు శంకర్రావు.

'ఆరేసుకోబోయి' పాట అయిపోయింది.

వెంటనే అరడజను వ్యాపార ప్రకటనలు దుమ్ము దులిపేశాయ్.

ఆ తరువాత హాఠాత్తుగా తుమ్ము వచ్చినట్లు శంకర్రావు గొంతు వినబడింది.

"....చెం మత్తు కలిగించే సాహిత్యం కనిపించేది. ఆమాత్తు కేవలం సాహిత్యానికే కాదు. ఆపాట బాణీదికూడా! అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ నిలిచిపోయే పాట ఇది-"

"ఇప్పుడే ఓగురాకులలో చిలకమ్మ పాట." అన్నాడు శంకర్రావు ప్రతిభా దేవి వంక గర్వంగా చూస్తూ.

ఆమె వెంటనే టేప్ చేయసాగింది. మళ్ళీ శంకర్రావు గొంతు-

"ఈ పాట వింటే మీరు ఒప్పుకుంటారు-నిజంగా ఇది అద్భుత మయిన అనుభూతి అని- ఇదిగో పాట వినండి—"

"ఆపాటగురించి చాలా బాగా చెప్పావు!" అన్నాడు లక్ష్మణరావు.

"ఇంకా చాలా చెప్పానుగానీ అదంతా ఎందుకనో కట్ చేశారు" అన్నాడు శంకర్రావు.

అందరూ నిశ్శబ్దంగా పాటకోసం ఎదురు చూడసాగారు. అరనిమషం గడిచిపోయినా పాట వినిపించటం లేదు.

"ఏమయింది?" అంది ప్రతిభాదేవి ఆశ్చర్యంగా.

"నాకూ అదే అర్థం కావటంలేదు." అన్నాడు శంకర్రావు.

అందరూ మరో అరనిమిషం ఎదుర్చూశారు.

పాట అంతులేదు.

"ఒకవేళ రేడియో స్టేషన్‌లో కరెంటుపోయిందేమో!" అన్నాడు చంద్రం

శంకర్రావు మళ్ళీ వివిధభారతికి ఫోన్ చేశాడు.

"హలో. నేను శంకర్రావుని మాట్లాడు తున్నానండీ."

"తెలుసండీ. ఇవాళ జనరంజని మీరే సమర్పిస్తున్నారని ముందే చెప్పారుగా."

"నేననేది రేడియోలోసంగతి కాదండీ ఇప్పుడు ఫోన్‌లో-"

"మాట్లాడండి."

"ఏదీ రేడియోలో పాట వినబడదేం-"

"వినబడడంలేదా?"

"లేదండీ సైలెంట్‌గా ఉంది రేడియో ఒకవేళ మీదగ్గరేమయినా కరెంటేమయినా పోయిందేమోనని-"

మా దగ్గర పాట వినబడుతూనే ఉందండీ- ఓహో అర్థమయింది. మీ రేడియోవాల్యూమ్ పూర్తిగా పెంచేయండి. పెంచాక అప్పుడు మీ చెవి రేడియో సౌండ్‌బాక్స్ దగ్గర పెట్టండి చక్కగా వినబడుతుంది."

"అదేమండీ. చెవి రేడియో స్పీకరువద్ద ఎందుకు పెట్టటం?"

"రికార్డింగ్ సరిగ్గా జరగలేదండీ. అందుకని పాట వినబడదు-"

"రికార్డింగ్ సరిగ్గా ఎందుకు జరగలేదు?"

"ఆ విషయం డబ్బింగ్ చేసినవారిని అడగాలండీ !

"ఎవరు డబ్ చేసింది ?"

"ఒకరనేమిటండీ ఎవరుపడితే వారే చేస్తారు. ఎవరూ లేకపోతే మ నైట్ వాచ్‌మన్ చేసేస్తాడు."

"ఎంత నైట్ వాచ్‌మన్ చేసినా సౌండ్ బాగా పెంచి రికార్డింగ్ చేయ వచ్చు కదండీ ?"

"మీ కో రహస్యం చెప్పమంటారా ?"

"చెప్పండి"

"మళ్ళీ ఎవరితోనూ అనరు కదా ?

"అనను లెండి"

"అసలు డిఫెక్ట్ ఆ రికార్డింగ్ హెడ్ దండీ"

"రికార్డింగ్ హెడ్డంటే ?"

"రికార్డ్ చేసే పరికరం అన్నమాట. అది కొంచెం చెడింది. ఇలా డబ్బింగ్ చేసేప్పుడు సాధారణంగా నేనేం చేస్తూంటానంటే దానిని ఓ చేత్తో గట్టిగా నొక్కి పట్టుకుని కూర్చుంటాను. అప్పుడు మాంచి సౌండ్ వస్తుంది. చాలామందికి ఈ విషయం తెలీదు, అంచేత తెలినివాళ్ళు డబ్బింగ్ చేసేప్పుడు ఆ హెడ్ "టచ్" అవకపోవడంవల్ల పాట నూతిలోనుంచి వస్తున్నట్లుంటుంది-"

"అది రిపేర్ చెయ్యొచ్చు కదండీ?"

"ఎందుకు చేయకూడదు? మహారాజులాగా చెయ్యవచ్చు

"మరెందుకు చేయరు?"

"అదేనండీ నేనూ ఎప్పుడూ తల్చుకుని తెగ ఆశ్చర్యపోతూంటాను"

శంకర్రావ్ ఫోన్ పెట్టేసి విషయమంతా ప్రతిభాదేవికి చెప్పాడు. ఆమె వెంటనే ట్రాన్సిస్టర్ వాల్యూమ్ పూర్తిగా పెంచి చెవి స్పీకర్ దగ్గర ఉంచి వినసాగింది ఓ క్షణం విన్నదోలేదో చటుక్కున తల దూరగా జరిపి "ఛీ మీ టేస్ట్ ఇంత హారిబుల్ అనుకోలేదు-" అంది శంకర్రావ్‌తో కోపంగా-

"ఏమయింది?" బెదురుగా అడిగాడతను.

"ఏ పాట వేశాను?"

"మీరే వినండి"

శంకర్రావ్ తన చెవి స్పీకర్‌కి ఆనించాడు


లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా
ఉంటారు మీరు. ఆరోగ్యమైన తాజాదనపు
అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో,
జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి...
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది
LIFEBUOY
for health

ఎక్కడో నూతిలోనుంచి వినబడుతున్నట్లుంది పాట.

"చల్లగాలేస్తోంది - మెల్లగా రమ్మంది-"

"ఇదేమిటి? ఈ పాట ఇక్కడ వేయాల్సిందికాదు-" కోపంగా అన్నాడు శంకర్రావు.

"మరెక్కడ వేయాలట?" లక్ష్మణరావు నవ్వుతూ అడిగాడు.

"నేను మరో సందర్భంలో ఈ పాట పల్లవిమాత్రం వేయమని కోరాను" మళ్ళీ వివిధ భారతికి ఫోన్ చేశాడతను.

"ఇదేమిటి? నేను చెప్పినపాట వేయకుండా మరో సందర్భంలో వేయాల్సిన పాట ఇక్కడ వేశారు?"

అతను నవ్వాడు.

"అది డబ్బింగ్ చేసినతనిని అడగాలండీ-"

"ఎవరు డబ్బింగ్ చేసింది - వద్దులెండి. అది టాప్ సీక్రెట్ కదా? అదీగాక అతని ఇంట్రెస్ట్ అతనిది- కాదనడానికి మనమెవరం?" అనేసి ఫోన్ పెట్టేశాడు.

పాట ఆగిపోగానే ట్రాన్సిస్టర్ కి ప్రాణం వచ్చినట్లు ఇల్లెగిరిపోయే సౌండ్ తో మోగసాగింది

టింగ్ - టింగ్ -

"ఒరుపాకెట్ మంజీరా చేగోడీ కుడప్పా

గివ్ మీ ఒక పాకెట్ మంజీరా చెగోడీ బ్రదర్

ఏక్ పాకెట్ మంజీరా చేగోడీ దేదోభాయ్"

ఏమిటి? మంజీరా చేగోడీకి ఇంత డిమాండా?

అవునూ. కోట్లాది ప్రజలు కక్కూర్తిగా తింటారు మంజీరా చేగోడీలు"

టింగ్ టింగ్-

"మీ బొమ్మ తెల్లబడిపోయిందా? చింతించకండి, జిగేటావారి హేర్ డైని వాడండి, నల్లగా నిగనిగలాడే బొమ్మతో మీ అందాన్ని రక్షించుకోండి"

టింగ్ టింగ్ -

ప్రతిభాదేవి కోపంగా ట్రాన్సిస్టర్ స్విచాఫ్ చేసింది.

అయిదు నిమషాల తర్వాత మళ్ళీ ఆన్ చేసేసరికి శంకర్రావు గొంతు కంచుమోగినట్లు వినబడుతోంది.

"నేను రచన చేసిన సినిమా "కాకరపాలెం కుర్రోడు" సినిమా షూటింగ్ అవుతున్నప్పుడు ఓ తమాషా జరిగింది, నేనూ డైరెక్టరుగారూ, మా పిక్చర్ హీరోగారూ ఏదో విషయం మాట్లాడుకుంటున్నాం.

నేను డైరక్టర్‌గారితో- టింగ్ టింగ్ "మీ వళ్ళు షరదగాఉందా?. గిర్మెక్స్ కంపెనీవారి బర్మెక్స్ వాడండి. దురదలో, వాపులూ, ప్రేలుడూ అన్నీ తగ్గిపోయి శరీరం నునుపుగా, అందంగా, పచ్చగా తయారవుతుంది. గుర్తుంచుకోండి బర్మెక్స్ - బర్మెక్స్ - బర్మెక్స్ -"

టింగ్ టింగ్.

ప్రతిభాదేవి తల రెండు చేతుల్తోనూ పట్టుకున్నారుప్పుడు

పక్కన మళ్ళీ శంకర్రావుగొంతు వినిపించసాగింది

"వంకాయకూరంటే నిజంగా అంత గొప్పది - "ఆ కూర చూసినప్పు డల్లా .. ."

అందరూ అదిరిపడ్డారు. శంకర్రావు మొఖం పాలిపోయింది.

"లగ్గవెప్పుడురా మావా అంటే - మాఘమాసం ఎళ్ళేదాకా మంచిరోజు లేదన్నాడు. ఆగేదెట్టాగా - అందాకా ఏగేదెట్టాగా -"

"కాకరపాలెం కుర్రోడు షూటింగ్ అవుతున్నప్పుడు జరిగిన తమాషాకీ, వంకాయకూరికీ, ఈ పాటకూ ఏమిటి సంబంధం ?"

కోపం అణచుకుంటూ అంది ప్రతిభాదేవి

చంద్రం లక్ష్మణరావ్ విరగబడి నవ్వాడు,

"ఒకవేళ ఏ సంబంధమూ లేకపోడమే జోకేమో."

పాట ఆగిపోగానే శంకర్రావు గొంతు తరుము కొచ్చింది.

"మా వూరి రైల్వేస్టేషన్లో ఆ బిచ్చగాడు రాత్రి పన్నెండు గంటల నిశ్శబ్దంతో ఎలుగెత్తి పాడే పాట వింటూంటే నాకిప్పటికీ కళ్ళ వెంబడి నీళ్ళు తిరుగు తూంటయ్ - ఇదిగో - ఆ పాట వినండి-మీ గుండెలు కూడా తప్పక బరువెక్కి పోతాయ్-"

టింగ్-టింగ్-

"విరాళ్-వాషింగ్ పౌడర్ విరాళ్,

బట్టలు తెల్లగ ఉతుకు-మురికిని తెల్లగజేయు



వాషింగ్ పౌడర్ విర్మా

వాషింగ్ పౌడర్ విర్మా"

టింగ్-టింగ్-

"ఏం పాట నాయనా అంతగుండెలు బరువెక్కే పాట అన్నావు" అడిగాడు లక్ష్మణరావు.

"ఏటికేతం బెట్టి వెయి పుట్లు పండించి-ఎన్నడూ మెతుకెరగరన్నా-"

"నిజంగా చాలా గొప్ప పాటరా గుండెల్ని పిండేస్తుందని-" వప్పుతున్నాడు చంద్రం

"ఈ ఒక్క పాట సరిగ్గా వేసినా చాలు వాళ్లు-" అన్నాడు లక్ష్మణరావు

కానీ పాట రాలేదు మళ్ళా శంకర్రావు గొంతు వినిపించసాగింది.

"టైమయిపోతోం దనుకుంటాను ఆఖర్లో కాకరపాలెం కుర్రోడులోని ఓ పాట వినిపిస్తాను-ఈ పాట సినిమాలో లేదు. సెన్సార్ వాళ్లు ముక్కలు ముక్కలు చేసేశారు ఆ దృశ్యాన్ని-వినండి-"

టింగ్-టింగ్-

"గర్భనిరోధకమాత్రాలు ఎలా వాడాలి?"

"ఋతుక్రమం అయిన మూడో రోజునుంచీ రోజూ రాత్రి పడుకోబోయే ముందు ఓ మాత్రమింగాలి. ఒకవేళ ఒక రోజు మర్చిపోతే రెండో రోజు రెండు మింగాలి. రెండో రోజూ గుర్తురాకపోతే మూడో రోజూ మూడు మింగాలి. అప్పుడూ మర్చిపోతే పాపాయిని అనాథశరణాలయానికి ఇచ్చి వేయాలి".

"అవును నర్సు చెప్పింది.

"తనూ పాపాయిని అనాధ శరణాలయానికే యిచ్చిందట అయినా నిన్ను కూడా అడుగుదామనుకున్నాను"

"టింగ్-టింగ్"

ప్రతిభాదేవి ట్రాన్సిస్టర్ స్విచాఫ్‌చేసి టేప్ రికార్డర్‌లోని టేప్ తీసి వేద పీఠ నుంచి కింద మురికి గుంటలోకి విసిరిపారేసింది.

"గెటవుట్" అంది అందరినీ....కోపంగా చూస్తూ. ముగ్గురూ రోడ్డు మీద కొచ్చేశారు

ఆ తరువాత వారం రోజులవరకూ శంకర్రావు ఆఫీస్‌కెళ్ళలేదు. గడ్డం పెంచుకుని పిచ్చివాడిలా ఇంట్లోనే గడుపుతున్నాడు.

ఆ రోజు శనివారం. వాళ్ళ తమ్ముడు గదిలోనుంచి రేడియో గట్టిగా విన బడుతోంది. అందమె ఆనందం-ఆనందమె జీవిత మకరందం-"

"ఈ పాట లేదన్నారు. ఇప్పుడెలా వినబడుతోంది ?" కోపంగా అనుకు న్నాడతను మరుక్షణంలో శ్రోతల ఉత్తరాల కార్యక్రమం ప్రారంభమయింది.

"రచయిత శంకర్రావుగారు సమర్పించిన జనరంజని సినిమా ఇంటిల్లి పాదీ ఎంతో తిట్టుకున్నాం వాక్యానికీ వాక్యానికీ పొంతన లేకుండా, చెప్పేదానికీ, పాటకూ సంబంధం లేకుండా, అర్ధంలేని సగం వాక్యాలు చదివి - వెధవ్వాగుడు వాగి శ్రోతలకు పిచ్చి ఎక్కించడానికి ప్రయత్నించారాయన. ఇంకోసారి ఇలాంటి పిచ్చి జనరంజనీలు సమర్పించకండి."

"వంగపల్లి నుంచి రామకృష్ణగారుకూడా శంకర్రావుగారిని బూతులు తిడుతూ ఉత్తరం రాస్తున్నారు పాటలు పరమ చెత్తగా ఉన్నాయనీ, అలాంటి చెత్తపాటలు వేయడంవల్ల శంకర్రావుగారి దరిద్రపు అభిరుచి తెలుసుకోడానికి వీలయిందనీ అంటున్నారాయన. అలాగే సికింద్రాబాద్ నుంచి సాయీరామ్‌గారు శంకర్రావు గారిని దూషిస్తూ రాశారు. ఇంకా సనత్‌నగర్ నుంచి అప్పలాచారిగారు. మల్కాజ్‌గిరి నుంచి రంగారెడ్డిగారు, ఉప్పల్ నుంచి ఉదయార్కర్‌గారు, రామ్ నగర్ నుంచి ప్రతిభాదేవిగారు, మలక్‌పేట్ నుంచి చంద్రం లక్ష్మణరావ్ గార్లు.... ...... "

శంకర్రావు పరుగుతో వెళ్ళి టేబుల్ మీదున్న రేడియో ఎత్తి నేలకేసి కొట్టాడు అతనికి పగిలిన ముక్కలు చూసే సరికి తెగనవ్వొచ్చింది".

హ్హాహ్హా జనరంజని-హ్హాహ్హాహ్హాహ్హా ప్రత్యేక జనరంజని-హ్హాహ్హాహ్హాహ్హా-" ★

# గ్రామ్యాలో నమ్మ్యా

కంభంపాటి సుబ్రహ్మణ్యం

రత్నగర్భ దేశంలో...

అన్నపూర్ణ రాష్ట్రంలో...

అదో అనామతు ఊరు .. వల్ల కాడులా ఉందిప్పుడు ... కాకాపోతే.... చిన్న వ్యత్యాసం వల్లకాట్లో జనసం చారం ఉండదు . కాని ఆ ఊళ్ళో మాత్రం చస్తూ బతుకుతున్న వాళ్ళతో. బతు కుతూ చస్తున్నవాళ్ళతో కళ కళ లాడు తుంటుంది....

ఆవూరు పచ్చని పంట పొలాలతో పిల్లకాలువలతో కళ కళ . .గల గల లాడుతుండేది ఒకప్పుడు. కరువు... దరి ద్రం, అతివృష్టి, అనావృష్టులతో విల విల లాడుతోందిప్పుడు...

'గ్రామాలు . దేశానికి జీవగర్రలు' అని మహాత్ముడన్నట్టుగుర్తు .. అందు కనే....ఆవూళ్ళో అంతా . చదువు కున్నవాళ్ళు... చదువుకోని వాళ్ళు.... వ్యవసాయాన్నే నమ్ముకొని.. ఉప వాసాలకి అలవాటుపడిపోయారు.

కరువు కరువు .. కరువు ....

అయిదు సంవత్సరాల కోమాటు . లక్ష ల్లొస్తాయ్ .. ఆవూరికి ప్రతి సంవత్సరం అతివృష్టో అనావృష్టో క్రమం తప్ప కుండా వస్తూనే ఉన్నాయ్

మనుషులకి తిండి, పశువులకి గడ్డి లేదు ...పశువులనమ్మితే కొనేవాళ్ళు న్నారు, అవి పాలివ్వక పోయినా కనీసం మనిషికి ఆహారంగా నన్నా పనికొస్తయ్ కాని .మనిషి నమ్మితే కొనే పీను గు లేనప్పుడు

అందుకే . ఆవూళ్ళో అందరు పశువుల్నమ్మేశారు . పసిపిల్లల్లా పెంచు కున్న గిత్తలు పసిపిల్లల్ని పెంచటానికి పనికొచ్చే పాలిచ్చే ఆవులు గేదెలు అన్ని సాముహికంగా కబేళాలకి చేరి పోయినయ్ .

కరువు పరిస్థితి గురించి వార్తాపత్రి కల్లో వేడి వాడి వార్తలు . అసెంబ్లీలో ప్రతిపక్షసభ్యుల ఆందోళనలు, వాకౌట్లు ఆనవాయితీ ప్రకారం . ప్రభుత్వం హామీలు . కరువు పరిస్థితిని అంచనా

వెయ్యటానికి కమిటీలు .... మంత్రి వర్యుల పర్యటనలు....ప్రజల కన్నీళ్ళ బదులుగా నాయకుల (మొసలి) కన్నీళ్ళ

"ఎన్నికోట్లయినా (తొడుక్కునేందుకా!) వెనకాడేది లేదు ...కరువు ప్రాంతంగా ప్రకటించిన ప్రాంతప్రజల్ని ఆదుకోవటానికి కావాలంటే కేంద్రం నించి కూడా డబ్బు తెప్పిస్తాం. అన్ని రకాల సహాయాలు అందిస్తాం" ... పెద్దమంత్రి ప్రకటన ... మంత్రివర్గ సమావేశం ...

"యుద్ధ ప్రాతిపదికమీద కరువునెలకొన్న ప్రాంతాన్ని ఆదుకోవాలి" ముక్తకంఠంతో నినాదం

"పాతఋణాలు మాఫు చేస్తేనో" ఒక మంత్రిగారి సలహా.

"దగ్గర్లో ఎలక్షన్లు లేవు....కనుక ఋణాల మాఫుపథకం....యుద్ధ ప్రాతిపదిక లిస్ట్‌నించి తీసెయ్యాలి" మరో తెలివిగల మంత్రి సలహా

"పనిలోపని .. కుటుంబ నియంత్రణ గురించికూడా ప్రచారం చేస్తే" ఆశాఖ మంత్రిగారి గోడు. ప్రభుత్వం అతివిశాల హృదయంతో ప్రజల్ని ఆదుకోవడానికి నడుం కట్టింది ఆహార సంస్థ గోదాముల్లో ముక్కిపోయిన 'అమెరికా' బియ్యాన్ని....ఉదారంగా ఇంటికి అరకిలో వంతున పంచింది....దేశానికి రైతు వెన్నెముక. రైతుకు నారు నీరు....అనే రెండు వెన్నెముకలు అందుకే ప్రభుత్వం ... మేలుజాతిని నాశిరకం విత్తనాల్ని అరువుగా రైతులకు పంచింది ...

బావులు తవ్వకోడానికి అతి ఉదారంగా ఋణాలివ్వమని బాంకులకు ఆదేశాలు ...ప్రభుత్వం ఇంతఅనాయాచితంగా సహాయం చేసినందుకు.. షాక్‌తో గుండె ఆగి కొంతమంది చనిపోయారు ...బాంకువారు ఇచ్చే ఋణాల మొత్తం ఏంచెయ్యాలా అని విపరీతంగా ఆలోచించి .. కొంతమంది హైదరాబాదులోని ఎర్రగడ్డ ఆస్పత్రిలోను మరికొంతమంది విశాఖపట్నం ఆస్పత్రిలోను చేరిపోయారు ఇంకా బతికున్న మొండి ప్రాణులకి అన్ని రకాల సహాయాలు అందాయి..

నారు పొయ్యాలంటే నీరుకావాలి.... నీరు కావాలంటే బావి తవ్వాలి....బావి తవ్వాలంటే .... బాంకువారు ఋణాలివాల్సి బాంకుఋణం సంపాదించాలంటే ..? సమితి ఆఫీసులో అధికార్లు, ఉద్యోగులు. బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసులో అధికార్లు ...ఉద్యోగులు... మనచే ఎన్నికచేయబడ్డ నాయకులు.... వీళ్ళంతా పరమపద సోపానపటంలో పాములా .?నిచ్చెనలా .. ?రైతురక్తం చమట రూపందాల్చి. చమట బాంకు ఋణ రూపం దాల్చింది ...

బాంకువారిచేతులు ఆధికారులచేతులు ప్రజలకొరకు .. ప్రజలచేత ఎన్నుకోబడిన నాయకులచేతులు తడిసి.... చిక్కిపోయి . కొంతభాగం మాత్రం ... బాంకు ఋణం రూపంలో రైతు చేతికి దక్కింది ...

ఇక బావి ఎలా ... ఎక్కడ తవ్వాలి? రైతు సమస్య

"ఎక్కడన్నా తవ్వుకో ... . ఎలా అన్నా తవ్వుకో సీ పొలంలో బావి తవ్వేసినట్లు పెద్ద పెద్ద పైపుల ద్వారా పైకి నీరు చిమ్ముతున్నట్లు సర్టిఫికెట్ ఇచ్చేస్తాం.... ఇక ఆ నీళ్ళతో నీ పొలం తడుపుకుంటావో. నీ బతుకు నందన వనం చేసుకుంటావో నీ ఇష్టం .. .. ముందు మాత్రం మా చెయ్యి తడుపు" . నిష్కర్షగా చెప్పేశారు ఇంజనీర్లు

ఇలా అందరి చేతులు తడుపుకుంటూపోయిన రైతు చేతుల్లో .... చేసిన అప్పును తలుచుకుంటు అరచేతిలో చమటలుపోసి .... తడిసిపోయిన కొద్ది నోట్లు మాత్రం మిగిలినయ్....

ఈ కాస్త డబ్బుతో ఏం చెయ్యాలో తోచక కొట్టుకుంటున్న రైతులకు అప్పు బాపతు మొదటి ఇన్‌స్టాల్ మెంటు తీర్చమని బాంకువారి తాఖీదు అందింది . అలా ఆ మిగిలిన డబ్బు కాస్తా బాంకువారికి జమకట్టేసి ... ఋణం తీసుకునేటప్పుడు వేలి ముద్రలు వేసిన బొటనవేలికి అంటిన రంగుపోగొట్టుకునే ప్రయత్నంలో ఉన్నారు ఆ ప్రాంత రైతులంతా . .....

సరిగ్గా ఆ సమయానికే . ఆ శాఖ మంత్రిగారు.... . పత్రికా విలేఖరుల సమావేశం ఏర్పాటుచేసి ... తమ ప్రభుత్వం రైతుల్ని సమయానికి ఆదుకున్న పథకాలన్ని వివరించి....ఆ ప్రాంతాన్ని సందర్శించటానికి బయలుదేరారు.

రైతుల గుండెల్లో రాళ్ళుపడ్డయ్ ఇప్పుడా మంత్రిగారు తమ పొలాల్ని, ... బావుల్ని తనిఖి చేస్తే...

"ఆందోళన చెందాల్సిన అవసరం లేదు . . మనందరికి బావులున్నట్టు మన దగ్గర సర్టిఫికెట్లున్నయ్ ... కాబట్టి . ఆ బావుల్ని దొంగలెత్తుకు పోయారని పోలీసు రిపోర్టిద్దాం . పదండి" ఒక చదువుకున్న రైతు ముందడుగు వేశాడు ...

మంత్రిగారు మంది, మార్బలంతో పొలాల తనిఖీ కొచ్చారు . ఆ పూళ్ళో రైతులందర్ని పేరు పేరునా పలకరించారు . పనిలో పనిగా.... "మళ్ళీ ఎలక్షన్లొచ్చినప్పుడు తనని గుర్తుంచుకోమన్నాడు" ....కాని.. కాని... బావుల్ని దొంగలెత్తుకుపోయారనే సరికి కంగు తిన్నారు....పంచాయతీ ఎలక్షన్లప్పుడు వార్డు మెంబర్లనీ ....మునిసిపాలిటీ ఎలక్షన్లప్పుడు కౌన్సిలర్లని ఎత్తుకుపోవడం



విన్నాడు గాని ...ఇలా బావుల్ని దొంగలెత్తుకు పోవడం వింతగా అనిపించి ...వెంటనే పోలీస్‌స్టేషన్ కెళ్ళి వాకబుచేశాడు .యస్. ఐ గారు డీసిప్లెయిన్‌డ్‌గా సెల్యూట్‌చేసి . ఫోర్ నాట్ వన్ ......పోర్ ాట్ బు తెచ్చిన ఎఫ్. ఐ. ఆర్. చూపించాడు..."పాత కె. డి గాళ్ళని చాలా మందిని బొక్కలో పెట్టే" శానన్నాడు.... .. "ఇంకా కొద్ది మంది దొరికలేదు . . వాళ్లు కూడా దొరికాక కేసు సైసలైజ్ చేస్తానన్నాడు..

మంత్రిగారి పరిస్థితి అగమ్య గోచరంగా తయారైంది ... ...కాస్త మెదడున్న పెద్ద మంత్రిగారికి పరిస్థితి వివరించడానికి రాజధానికి తిరిగొచ్చాడు....

అసెంబ్లీలో .. .. అపోజిషన్ వాళ్లు ఈ బావులు దొంగలెత్తుకుపోయిన ఉదంతాన్ని ఆసరాగా తీసుకొని....రూలింగ్ పార్టీ వాళ్ళని చాకిరేవు పెట్టేశారు ...

వెంటనే ఆశాఖ మంత్రిగారు ఓ.ఐ.ఎ,యస్ ఆఫీసరుతో ఏక సభ్య కమీషన్ నియమించారు విచారణకు అపోజిషన్‌వారు ...... సభాసంఘాన్ని కూడా నియమించాలని పట్టుబట్టారు. ...పెద్ద మంత్రిగారు దానిక్కూడా ఒప్పుకున్నారు.

ఆ తర్వాత సభా సంఘం వారు ఆ గ్రామాన్ని సందర్శించి........ఎవరెవరు ఎంతెంత మేశారో తెలుసుకొని........ న్యాయంగా తమకి రావాల్సిన వాటాలు తెచ్చేసుకున్నారు.

ఆ తర్వాతెప్పుడూ......ఆపోజిషన్ వారు...అసెంబ్లీలో ఆవూసెత్తలేదు ..

ఐ ఎ. యస్. ఆఫీసరుగారు....... కొన్ని అవకతవకలు జరిగినట్టు అంగీకరిస్తూ... "అందుకు బాధ్యులైన ఆఫీసర్లని.....ఉద్యోగులను.....శిక్షగా..... మరో వూరు ట్రాన్స్‌ఫర్ చేస్తే సరిపోతుంది"...అని తన నివేదిక సమర్పించారు.

మళ్లీ యుద్ధ ప్రాతిపదికమీద........ రైతుల్ని ఆదుకోవడానికి........ఆ అధికార్లు ఉద్యోగులు....మరోవూరు తరలి వెళ్ళారు........



# కల్లోల గౌతమి

## లల్లాదేవి

జరిగినకథ

(తెల్లవారగానే యుద్ధసమారంభమైంది ..కుండాలకుని వెంటవచ్చిన తుల్య భాగ యుద్ధానికి సిద్ధపడింది. మహాదేవుడితో భయంకరమైన పోటీలో మొదటిసారి పరజితురాలయింది ...తరువాత పోరులో మెలుకువలు తండ్రిద్వారా గ్రహించి అతన్ని చిత్తుగా ఓడించింది... )

జరుగుతున్నకథ

నాగ బంధం వేసి ద్వంద్వ యుద్ధంలో మహాదేవుణ్ణి మట్టికరిపించాక తుల్య భాగ యువతీ యువకులలో అగ్రతాంబూలం పుచ్చుకుంది కృష్ణా తీర భూముల్లో ఆవాసముంటున్న నాగ యక్ష పుండ్రపు పుళింద జాతుల వారంతా ఆమె శారీరక మయిన శక్తి సంపన్నతకు జేజేలు పలకటం ప్రారంభించారు.

"కుండాలకుని తనూభవయట. తొడచరచి బరిలో నిలిచిందంటే కండలు తిరిగిన యువకులను సైతం పట్టుబట్టి కొట్టించగలదట" అని చెప్పుకోవటం ప్రారంభించారు.

వయోభారం పెరిగి దక్షిణాది గణాలకు నాయకత్వ బాధ్యతలను నిర్వహించ లేని అలసుడయినాడు కుండాలకుడు. తన బిడ్డ అయిన తుల్యభాగ కేవలం ఒక గణాధ్యక్షుని తనూభవగానేకాక తన శక్తి సంపన్నతను నిరూపించుకుని యువతీ యువకుల మనోమయ ప్రపంచంలో ఆరాధనీయ కావటం అతనికి ఆనందాన్ని కల్గిస్తోంది

ఆ వార్తలు వింటున్నప్పుడు అతని అంతర్యం ఆనంద కాసారమయింది. చెప్పకుండా అడవి దారుల వెంటపోయిన తుల్యభాగ తిరిగి ఎప్పటికొస్తుందో తెలియదు. తాను వయోభారంవల్ల దాక్షిణాత్య గణాధ్యక్ష పదవి నించి సంప్రాప్తమయిన కార్య వ్యగ్రతవల్ల వ్యవసాయం పనులకు వెళ్ళలేకపోయేవాడు.

తన అర్ధాంగి యింటికయిన పనులేకాక పంట పొలాలలోని పనులన్నింటిని తానే స్వయంగా చూచుకుంటుండేది. అటువంటి క్లిష్ట తరమయిన సమయంలో తుల్య భాగ యిటు యింటి పనుల్లోనో, అటు వ్యవసాయపు పనుల్లోనో అంది వస్తుందని ఆశించారు దంపతులు.

కాని తుల్యభాగ తుంటరిలాగ అయిపోయింది, అడవి దారుల వెంటపడి వేటకై వెళ్ళిపోతే అమ్మ గుర్తుండదు. నాన్న జ్ఞాపకం ఉండదు ఆమె తుంటరిలా నిష్ప్రయోజకురాలవుతోందని భావించాడు తండ్రి కుండాలకుడు. కాని వేట అనే వ్యసనంవల్ల ఆమెకింతటి శక్తి సంపన్నతొస్తుందని ఊహించనైనాలేదు. దాక్షిణాత్య భూములలో ముఖ్యంగా కృష్ణాతీరవాసులయిన గణాతంత్ర ప్రజలలో నేరుగా పులితో పోరాడగలిగినవారు అయిన వీరుల సంఖ్య అల్పాతి అల్పం

అటువంటి వారిలో తుల్యభాగ ఒక్కరితె అయింది. అంతేకాక ద్వంద్వ యుద్ధంలో మహాదేవుడంతటి శక్తిశాలిని పల్లటీ కొట్టించింది. ఆమె శారీరకమయిన శక్తి సంపన్నత నిరూపితమవుతోంది.

ఇదంతా చూస్తూ ఉంటే తన నించి వారసత్వంగా దక్షిణాది గణాల వారి నాయకత్వబాధ్యతలను స్వీకరించేందుకు ఆమె సమాయిత్తురాలు కాగలదనిపిస్తోంది. తండ్రికా అంతకన్న కోరదగినదేముంటుంది.

కాని రానున్న కాలం మంచిది కాదు. దక్షిణాదివారికి అనుకూలమయిన వికాసం వేటపనిలోనూ,వ్యవసాయపు పనులలో అంతర్లీనులపోయి శాంతిజీవనం సాగిస్తూన్న దక్షిణాదివారంటే ఔత్తరాహులకు అసూయ. పాడిపంటలతో పచ్చని పొలాలలో విలసిల్లుతోన్న దక్షిణాది భూములపై వారికన్ను పడింది.

శాంతి కాముకులై యుద్ధాలు లేకుండా అవాంతరాలకు అతీతంగా సుసంపన్నంగా దక్షిణాది వారు వర్ధిల్లుతున్నారని వారికి కన్నుకుట్టు. గతంలో అనేకమార్లు



వారు దండెత్తి వచ్చి దక్షిణాది సంపదల్ని దోచుకునిపోయినారు. ఇది చారిత్రక సత్యం.

తిరిగి వారు దండయాత్రలకు సన్నద్ధులవుతున్నారని వార్తలు వస్తున్నాయి. సామ్రాజ్య విస్తరణ కాంక్షాపరులయిన ఔత్తరాహులు సహజంగానే యుద్ధ విద్యా విశారదులయినారు. వారు అత్యంత ఆధునికమయిన ఆయుధ సామగ్రిని సంపాదించుకున్నారు.

రాచరికపు వ్యవస్థలు ఉత్తరాది భూముల్లో మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లుతున్నాయి. రాచరికపువ్యవస్థ అంటే లాలసాపూర్ణమయిన అడంబరమయిన. విలాసవంతమయిన జీవితాన్ని సాగించేందుకు ఒక్కరు మిగిలిన వారిని దోచుకోవటం. అదేమని ప్రశ్నిస్తే వారందరికీ రక్షణ కల్పించటమనే మిషను ఎత్తి చూపటం.

ఒకరి కోసం పదుగురు అన్న సిద్ధాంతం వారిది.

వారి ఆలోచనలన్నింటిని దక్షిణాదివారిపై రుద్ది ఇక్కడ సంపదల్ని దోచుకుపోయేందుకు ఎన్నో ఎత్తులు వేస్తున్నారు. ఇటువంటి క్లిష్టమయిన సమయంలో దక్షిణాదిగణాలకు నాయకత్వం వహించటమంటే కత్తిమీది సాము. ఆ బాధ్యతలు

నిర్వహించేందుకు తుల్యభాగ సమర్థవంతమయిన నాయకత్వాన్ని అందించగలదా అన్నదే సమస్య.

కుండాలకుడు ఆలోచనా నిమగ్నుడయినాడు. తనదిగా గడచిపోయిన గతాన్ని. తనది కాని భవితవ్యాన్ని, సంక్షుభితమయిన సాగరంలా ఉన్న ప్రస్తుత మనోవర్తనాన్ని సమన్వయించుకుంటూ అంతర్లీనుడయినాడు.

ఎప్పుడొచ్చిందో తుల్యభాగ అతని బాహువుల మీద చెంప ఆనించుకుని కూర్చుంది. పసిపాపలా తండ్రి ముఖంలోకి చూడసాగింది.

కుండాలకుని ఆలోచనాముద్ర తుల్యభాగ రాకతో అసాంతమయింది. "అమ్మా ఈ ప్రొద్దు యిల్లు విడచిపోనేలేదు. చిత్రవేగ, ఉలూపి మొదలయిన మిత్ర బృందమెవరూ ఈ చాయలకు రాలేదు ఏదో విశేషమే ఉండి ఉంటుంది" అన్నాడు కుండాలకుడు చిరునవ్వునవ్వుతూ. తుల్యభాగ రవంతసిగ్గుపడి తలదించు కుంది. తండ్రి చేస్తున్న పరిహాసం వెనుక అర్థమేమిటో గ్రహించిందామె.

బాధ్యత విడిచి కాలహరణానికై ఏవో వ్యాపకాలు కల్పించుకుంటున్నా వన్న ధ్వని అది.

"తండ్రీ ఈ ప్రొద్దు వేటకు పోవాలన్న ఆలోచన లేదు, పంట పొలాలకు వెళ్ళి అమ్మను చూచి రావాలనుకుంటున్నాను. మీ అనుమతి తీసుకునేందుకే యిలా వచ్చాను. వెళ్ళిరానా?" అని అడిగింది తుల్యభాగ. కుండాలకుడు పొంగి పొరలి వస్తున్న నవ్వును పడగ మీసం చాటున పదిలంగా దాచుకున్నాడు. నవ్వుల తాలూకు వెలుగుతో ముఖమంతా కాంతివంతమయింది.

ఆట పాటలు తప్పరవంత అయినా బాధ్యతలు పట్టించుకోని ఆమె అలా అడగటం విడ్డూరమే అనిపించింది ఇంత కాలానికయినా బాధ్యతలు తెలియ వచ్చినాయి కదా అని మనసు రవంత ఆనందంతో నిండింది. తృప్తిగా నిట్టూర్చి నాడు కుండాలకుడు.

"అలాగే తల్లీ అమ్మను చూచి రావాలన్న ఆలోచన ఇంత కాలాని కయినా కలిగినందుకు నిన్ను అభినందించాలి. మంచి కాలమంతా గతించి పోయింది. వృద్ధాప్యం ప్రొద్దులా పొడిచింది.

వెనుకకు వాలిపోతున్న కాలంలో ముగింపు అధ్యాయాలకు నాందిగా శారీ రకమయిన శక్తి సంవన్నత పిలుప్తమయిపోయింది. ఇటువంటి వేళ నీవు ఇంటికి

కాకుండా కాలాన్ని నిర్హేతుకమయిన వ్యాపకాలతో వ్యయపరుచుకుంటున్నావు

నా అశక్తతనూ, నీ అవ్యవస్థనూ గమనించిన నీ తల్లి బాధ్యతలపట్ల బద్ధురాలయి నిలిచింది. నడుంకట్టి వ్యవసాయపు పనులన్నీ స్వయంగా చూచుకోవటం సాగించింది.

అడవి వృక్షాలను నరికి భూమిని మైదానంగా మార్చుకుంది. వృక్షాలను పెకలించాక బండరాళ్ళను దొర్లించ గుర్రాలచేత పట్టి లాగించి భూమిని చదును చేసుకుంది గుర్రాలతో వ్యవసాయం చేయించి దాన్ని పంట పొలంగా మార్చింది.

మన ఆవాసాలకు దూరంగా ఎక్కడో ఒంటరిగా ఉంటూ పంటలు పండిస్తోంది. ఆమెకు మాత్రం తక్కువ వయసున్నదా ఏమి? సహస్ర మాస జీవి. అయినా ఓపిక చావ నివ్వకుండా శ్రమిస్తోంది.

ఇదంతా ఎందుకు చేయవలసి వచ్చిందంటావు?" అని ప్రశ్నించినాడు కుండాలకుడు. తన వంతు కర్తవ్యం ఎలాంటిదో ఆ యింటి పట్ల నిర్వహించవలసిన బాధ్యతలు ఎలాంటివో తెలుసుకుందుకు ఆమె సన్నద్ధురాలవుతుందని ఆశించాడు సాలోచనగా తుల్యభాగ వంక చూచినాడు తండ్రి.

ఆమె చెంపల్ని ఒకనాడు మొత్తం దక్షిణాది ప్రజల బరువు బాధ్యతలను వహించిన తండ్రి బుజాలకు ఆనించుకుని అర్ధ నిమీలితురాలయింది. అది ఆలోచనాముద్ర అని భావించినాడు తండ్రి

"తండ్రీ! ఇక నించీ ఈ వ్యవసాయపు పనులలో అమ్మకు అలసట శ్రమ నించి కొంత విశ్రాంతి కల్పించాలనే కదా నా ప్రయత్నం" అన్నదామె నెమ్మది అయిన కంఠ స్వరాన.

ఇంత కాలానికి నా బిడ్డ నా ఆశలు పండించాలని సంకల్పించింది అని పొంగిపోయినాడు కుండాలకుడు ఆతని అంతర్యం ఆనంద మందాకినిలా అయి పోయింది. పితృ హృదయం తాలుకు అంతరాన సంతోష సాగరం పొంగి పొరలింది.

ఒకనాడు దక్షిణాది వారి బరువు బాధ్యతలను కాచిన తన భుజస్కంధాలపై ఆనించి ఉన్న చెక్కిళ్ళను వాత్సల్యంతో ముద్దాడినాడు. తన ఆనందం తాలూకు సంకేతాన్ని ఆమెకు అనుమతిగా యిచ్చివేశాడు.



"వీలయితే నీవు కొంత కాలం అక్కడ వుండి ముదిమి వల్ల దిగజారి పోతున్న శారీరక శక్తిని కూడతీసుకునే అవకాశం నీ తల్లికి కల్పించు" అన్నాడతడు ఆర్థింపుగా.

ఔనౌనని తల ఎగురవేసింది తుల్యభాగ. వెంటనే అక్కడనించి లేచి వెళ్ళిపోయింది. తిరిగి కుండాలకుడు ఆలోచనల మధ్య ఊగిసలాడటం ప్రారంభించినాడు.

రవంత సెపు ఆయాక తిరిగి వచ్చింది తుల్యభాగ॥

ఈ సారి ఆమె వెంట మిత్ర బృందమంతా ఉన్నారు. వారంతా జీవ శక్తులతో మిస మిస లాడే అశ్వాలను అధిరోహించి వచ్చారు. ఇంట వసారాలో తండ్రి చేరువకు రాగానే ఆకాశం నించి రాలి పడుతున్న ఉల్కలా క్రిందికి ఉరికింది తుల్యభాగ.

ఆమె అధిరోహించిన అశ్వం ఉన్నతమయినది. దానిది విశాల మయిన నుదురు, నుదుటి మీద ధవళ బిందువు, డెక్కలు సగానికి చీలిపోయిన వలయాకృతిలో ఉన్నాయి. గిట్టల పైభాగం సన్నగా బలంగా అమిత వేగంతో చలించేందుకు వీలుగా ఉంది.

మోకాళ్ళమీద తెల్లని చుక్కలు అక్కడనుంచి తొడ కండరాలు విస్పష్టమయి ఆ వృతులతో ఇనుప బద్దలవలె కాలు కదిపినప్పుడల్లా పిట పిట లాడుతున్నాయి.

పొట్ట అండాకృతిలో చేయి వేస్తే జారి పోయేలా ఉంది నాభి దగ్గిర ఓ తెల్లని చుక్క, పిడుము ఎక్కు పెట్టిన విల్లులా ఒరిగి పోయి రవికిటణం సోకగానే తటుక్కుస్తోంది.

తోక కుచ్చులు వింజామరలాగ దీర్ఘతరమయిన కేశాలతో నిండి కుచ్చు చివరి తెల్లని చుక్క కన్పిస్తోంది.

చెవులు ఆకాశాన్ని గుచ్చుతున్న ఝాలు ములుకుల్లా ఉన్నాయి.

అది ఒకసారి నోరు తెరిచి హయహేష విన్పించింది.

గుర్రాలు పరుగులు తీసేందుకు సంసిద్ధ మయినప్పుడు ఒక విధంగా దేహము అమరించుకుని నిలుస్తాయి స్వారీ చేయటం సంపూర్తి యాక విశ్రాంతి తీసుకునే ముద్రను అభినయిస్తూ నిలుస్తాయి

దాని తొడ కండరాలపై అరచేత్తో ఒక దెబ్బ అంటించి ప్రేమగా చిరు నవ్వు నవ్వింది తుల్యభాగ. ఆ జీవశక్తి కలిగిన అశ్వం తల తిప్పి ఆమె వెంక చూసింది.

మరొక మారు హయ హేష విన్పించింది

ఆమె వెంట వచ్చిన బృందారకులు అంతా గుర్రాలు దిగి పసారాలోకి వచ్చారు. తమకు గణాధ్యక్షుడు. అనుభవశాలి అయిన కుండాలకుని పాదాలకు నుదురు తాకించి వరుసగా నమస్కరించారు.

వారందరినీ చూచి కాలగతిలో కరిగి అదృశ్యమైపోయిన తన యౌవనం తాలూకు స్మృతి వీచికల్ని స్మరించాడు కుండాలకుడు.

"యువశక్తి అంతా ఇలా ఉరికి వచ్చారే దేమిటి" అని ప్రశ్నించాడు.

వారెవరయినా మాట్లాడేందుకు ప్రయత్నిస్తారేమన్న అనుమానంతో ముందుగా తానే అందుకుంది తుల్యభాగ.

"తండ్రీ వీరుకూడ నాతో పాటుగా వస్తున్నారు. వ్యవసాయపు పను లలో అమ్మ ఈ ప్రాంతాలకు ఆదర్శ వనిత ఆమె నించి నేర్చుకోవలసింది చాలా ఉంది అందుకే అమ్మను చూడాలన్న ఉబలాటంతో వీరంతా బయలు దేరినారు. ఎలాగు పోతున్నానుకదా అని నేనే రమ్మన్నాను" అన్నదామె.



## కె.విశ్వనాథ్

### పూర్ణోదయా మూవీ క్రియేషన్స్

# సాగరసంగమం

నిర్మాత: ఏడిద నాగేశ్వరరావు

సంగీతం: ఇళయరాజా. ఫోటోగ్రఫీ: నివాస్. మాటలు: జంధ్యాల. పాటలు: వేటూరి

కృష్ణా: లక్ష్మీఫిలింస్. గుంటూరు: కనకదుర్గాపిక్చర్స్, తూ: పద్మావతి పిక్చర్స్
వైజాగ్-శ్రీకాకుళం: విజయలక్ష్మీఫిలింస్. తూ.గో.జిల్లా: శివాజీఫిలిమ్స్, త్రా: సర్వశ్రీ...
ప.గో.జిల్లా: శివాజీఫిలిమ్స్, త్రా: ఉషాపిక్చర్స్. నెల్లూరు: లక్ష్మీజ్యోతి పిక్చర్స్.
మైసూరు: కె.ఆర్.పి. పిక్చర్స్ ఒరిస్సా: శ్రీరామాఫిలింస్. నైజాం: శ్రీవెంకటకృష్ణా
సి.డె: భాస్కర్ పిక్చర్స్

ఆ మాటలు తండ్రి చెవులకు అత్యంత విశ్వాస పాత్రమయినవిగా విన్పించలేదు. ఆమె ఏదో కప్పి పుచ్చేందుకు అలా కథలు కల్పించి వల్లిస్తోందని గ్రహించినాడు అనుభవశాలి అయిన కుండాలకుడు.

ఉత్సాహశక్తి ఉరకలు వేసే వయసులో ఉన్న తుల్యభాగ కార్యక్రమాలు దిన దిన గండంగానే పరిణమిస్తున్నాయి.

అయితే ఇంతకూ ఈమె వీరందరినీ కూడదీసి ఈ వ్యూహం చేయదలచుకున్న పని ఏమిటో తెలుసుకోవాలని సంకల్పించాడు.

అతడు చతురుడు ఆలోచనాశాలి.

అతని అనుభవం అతని వయసులాగే సుదీర్ఘమయినది అతని దృష్టి ఆకాశంలా సునిశితమయినది ఆలోచనలు సముద్రంలా లోతయినవి. ఆశయాలు హిమగిరుల వలె ఉన్నతమయినవి

అందునించి బిడ్డ రూపొందించే కార్యక్రమాలు ఆధారంగా ఆమె భవిత వ్యాన్ని గ్రహించగల శక్తిశాలి అతడు. ఆమె రూపొందించిన కార్యరూపాన్ని గ్రహించే ప్రయత్నంలోకి దిగాడు.

"అమ్మా! అతిథులు. అందునా వయస్కులయిన మిత్ర బృందారకులు కదా వీరంతా ఇంటికి వచ్చిన వారికి అతిథి మర్యాదలు చేయటమే కదా మన బాధ్యత!" అని హెచ్చరించాడతడు.

తుల్యభాగ తండ్రి వంక దీనంగా చూచింది. మిత్ర బృందారకుల వంక వేడికోలుగా చూచింది.

"అవునవును వీరందరికీ పుట్ట తేనే పంచియిస్తాను" అని చెప్పేసి అక్కడనించి మెల్లగా జారుకుంది తుల్యభాగ.

ఆమె అవతలకు వెళ్ళగానే రవంత అయినా సమయాన్ని వృథా చెయ్య లేదు కుండాలకుడు మిత్ర బృందారకుల వంక చూచి చనువుగా నవ్వాడు

"జవ సత్వాలు కలిగిన మీరంతా దక్షిణాది వారసులు. మీ వంటి యువతీ యువకుల శక్తి సంపన్నత ఒక్కటే మనకు రక్ష!

ఓయి మహాదేవా! ఆనాడు ద్వంద్వ యుద్ధంలో నీవు ప్రదర్శించిన నేర్పు స్మరణీయంగా ఉంది బాగు బాగు మకరికా బంధంలో మా తనూభావను అల యించావు ఆమె నాగ బంధాన్ని ప్రయోగించి నిన్ను చిత్తు చేసింది.



ఆనాటి ఓటమి నీలో ద్వేషాన్ని రగల్చిందా? లేదు కదా. మనలో అంతః కలహాలు శత్రురాజులకు మంచి అవకాశం యిస్తాయి. మన బలహీనతలు ఏవయినా ఉంటే అవే ఆయుధాలవుతాయి. అందునించి దృఢప్రాయం అయిన ఓటమిని దృఢోత్సాహంతోనే స్వీకరించాలి.

ఓటమిని చిరునవ్వుతో స్వీకరించాలి.

నీవు అలాంటి వాడివేనని నాకు తెలుసు. ఆ ఓటమి గురించి నీవు మరచినావు కదా." అని ప్రశ్నించాడు కుండాలకుడు.

అందుకు నిండుమనసుతో బదులు చెప్పాడు మహాదేవుడు.

"గణపతీ, ఆనాడు పురుషాధిక్యపు అహంకారంతో తుల్యభాగ శక్తి సంపన్నతను అంచనా వేయలేక ప్రల్లదనాలు వల్లించాను. అందుకు తగిన శిక్ష అనుభవించాను.

అయినా అది నాలో ద్వేషాన్ని కలిగించలేదు. విద్యతో స్పర్థలో ఉండవచ్చును కాని అది విద్వేషంతో అసూయతో నిండినది కాకూడదు కదా!" అని బదులు చెప్పాడతడు.

కుండాలకుడు తృప్తిగా నవ్వుకున్నాడు.

"మీరంతా వేటపనులకు స్వస్తి చెప్పి వ్యవసాయపు పనులు ప్రారంభించా

అనుకున్నారా?" అని ప్రశ్నించాడు ఆ బృందారకులలో వెనుకగా నిలిచివున్న ఐరావతి; ఆ స్త్రీక లిరువురూ ఒకరి ముఖానొకరు చూచుకున్నారు.

ఐరావతి అం కున్నది. ఆమెకు అస్మృతి మెలా చెప్పాలో తెలియదు.

"బిడారు కూడా చూడవచ్చని బయలుదేరాము" అన్నదామె యధాలాపంగా కావలసిన సమాధానం రాగానే కుండాలకుని నేత్రాలు విస్ఫారిత మయినాయి. నుదుటమీది చర్మం ముడుతలుపడింది

"శమంతుని బిడారు మళ్ళీ వచ్చిందా?" అన్నాడతడు ఆశ్చర్యంగా.

"అవును గణాపతా! శమంతుడు బిడారుతో వచ్చాడు. అతడు ఆర్యరాజు లకు ఆతరంగికుడట. వారినుంచి అధునాతనమయిన ఆయుధాలను దక్షిణాదివారి కోసం తెచ్చాడట.

యవనాశ్వాలు ఉత్తమ జాతివి అతని బిడారులో అసంఖ్యాకంగా ఉన్నా యట ఔత్తరాహులనుంచి అపురూపమయిన వస్తుసంచయాన్ని తరించుకు వచ్చాడు. అది చూచేందుకు మేమంతా పోతున్నాం.

పోతూ పోతూ దారిలో అమ్మగారిని పలకరించి పోవాలన్నది తుల్యభాగ సంకల్పం" అంటూ అసలు కధను వివరించింది ఐరావతి,

కుండాలకుడు రాటలా అయినాడు దక్షిణాది రక్తాన్ని పంచుకుపుట్టిన శమంతుడంటే ఏమిటో అతనికి బాగా తెలుసు. అతడు దారితప్పిన సహోదరుడు. ద్రవిడ రక్తాన్ని రాజులకు మధుచషకాలలో నింపి అందించిన జాతిద్రోహి.

ఆర్యరాజుల చారుడుగానే తిరిగి దక్షిణాది ప్రాంతాలకు వచ్చిఉంటాడు. అమాయకులు శాంతికాముకులు అయిన వీరి జీవితాలపై అతని నీడ పడిందంటే తిరిగి యుద్ధభయం ముంచుకొచ్చిందనే అనుకోవాలి.

ఔత్తరాహుడు అందించే ధనరాసులను ఆశించి జాతిద్రోహానికి, ఆత్మ ద్రోహానికి తలపడిన నీచుడు శమంతుడు.

ఔత్తరాహులనించి అందమయిన వస్తు సంచయాన్ని సేకరించి దక్షిణాది భూములకు వస్తాడు. అవి యువతీ యువకులను ఆకట్టుకుంటాయి. అధునాతన మయిన ఆయుధాలు జవసత్త్వాలు కలిగిన యవనాశ్వాలు స్త్రీని బానిసగా విలాస

రెండు దశాబ్దాలకు పైగా తమ రచనలతో పాఠకులను ఉర్రూతలూగిస్తున్న..

ప్రఖ్యాత రచయిత్రి




రచనలు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| చెట్టు-ఛాయ | 6.00 | బృందావనం | 7.50 | ధర్మచక్రం | 12.00 | జనరంజని | 12.00 |
| విశ్వ | 6.00 | దివ్యదీపావళి | 7.50 | చక్రవాకం | 12.00 | శ్రేయసి శాపం | 6.00 |
| సత్యం శివం సుందరం | 11.00 | కల్పవృక్షం | 6.00 | కళ్యాణమందిర్ | 7.50 | అనిర్వచనీయం | 6.00 |
| శిలలు-శిల్పాలు | 12.00 | దిక్చక్రం | 6.00 | ప్రేమనగర్ | 10.00 | [illegible] | 6.00 |
| పూజారిణి | 15.00 | చక్రనేమి | 20.00 | చక్రభ్రమణం | 10.00 | సుప్రభాతం | 6.00 |
| సూర్యముఖి | 10.00 | శంఖుతీర్థం | 12.00 | యవనిక | 6.00 | ఉషస్సు | త్వరలో |
| కల్పన | 6.00 | శాంతినికేతన్ | 12.00 | సంసారచక్రం | 7.50 | | |
| నందనవనం | 12.00 | భాగ్యచక్రం | 10.00 | పెళ్ళి ఎవరికి! | 6.00 | | |

మీ దగ్గరి బుక్ షాపుల్లో కొనండి. లేదా కావలసిన పుస్తకం ఖరీదులో 1 రూపాయి తగ్గించి M.O పంపితే- ఆరు రూపాయిలకి VP పోస్టులో పంపగలము.



నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్
విజయవాడ-2 ఫోన్: 74005.

వస్తువుగా భావించే ఔత్తరాహులయిన అద్యరాజులు తమ ఆనందం కోసం సృష్టించుకున్న అధునాతనమయిన సామగ్రిని వెంటపెట్టుకు వస్తాడు.

వాటిని ఎరచూపి ఈ యువతీ యువకులను ఆకట్టుకుంటాడు. వారిని బానిసలుగా మార్చి ఔత్తరాహులకు అమ్మివేస్తాడు.

అతనివల్ల దక్షిణాతుల్య యింట ఆడపడుచుల ఆత్మలు ఔత్తరాహ నగర వీధులలో అంగళ్ళలో అమ్మబడుతున్నాయి. స్వజాతి జనులకు ద్రోహం చేయటమే ధనార్జనకు చక్కని మార్గంగా ఎంపిక చేసుకున్న బిడారి వర్తకుడు శమంతుడు.

అతని పేరు వినగానే కుండాలకుని ముఖం కోపించిన కందలా, విచ్చిన మందారంలా, పులిగోళ్ళలో గుచ్చిన ఈటెలా ఎర్రపడింది.

ఈ అంశాన్ని ముందుగా తాను ఆరా తీయటం మంచికే అయిందని భావించాడు కుండాలకుడు. శమంతుడు విసిరిన వలన్నింటినీ చూచి ఆకర్షితులయినారీ యువతీ యువకులు.

కపటమూ, కశ్మలమూ, కాలుష్యమూ లేని నిర్మలమయిన ఆలోచనలు వారివి. ఒకసారి శమంతుని బిడారు వంక ఆకర్షితులయినవారు అది చూడకుండా ఉండలేరు.

ఒకసారి ఆ బిడారు చూడాలని శమంతుని పరిధిలోకి వెళ్ళినవారు అతని మాటల మాయా జాలంలో పడకుండా ఉండలేరు. ఒకసారి అతని మాటల మాయలో చిక్కిన వారు తిరిగి దాక్షిణాత్యులు కాలేరు.

అందునించి ఈ అంశాన్ని ముందుగా తాను తెలుసుకోవటం మంచికే అయిందని భావించాడు కుండాలకుడు.

అంతలో చెక్క లోటాల్లో తేనె ఒంపుకుని తీసుకువచ్చి అందరికీ అంది చింది తుల్యభాగ తండ్రికి కూడా ఇచ్చింది.

"తల్లీ! వృద్ధుడయిన నీ తండ్రిని వంచించాలని ప్రయత్నం చేస్తున్నావా? ఔత్తరాహుల ఎత్తులను సైతం చిత్తు చేయగలిగిన నీ తండ్రి ప్రజ్ఞాపాటవాలు

సెబాష్ రామూ మేచ్ ని గెలిపించావు—చొక్కా మురికైతే ఏంపోయిందని!






**హై పవర్ సర్ఫ్**
**అమిత తెల్లగా ఉతుకుతుంది...**
**అమిత తెల్లగా, కనువిందుగా!**




తెల్ల బట్టలకి సెబాష్ తెలుపు, రంగు బట్టలకి సెబాష్ గెలుపు

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

ఏపాటివో పసిదానివి నావంటి నించి నీ కింకా తెలియవు" అంటూ ప్రారంభిం చాడు కుందాలకుడు.

అంగు తిన్న తుల్యభాగ అదరుపాటున మిత్ర బృందారకులందరినీ చూచింది. వారు చిరునవ్వు కెరటాలను పెదవుల మాటున అదిమి ఉంచుకో వటాన్ని గమనించిందామె.

తండ్రికి అసలు సంగతి తెలిసిపోయిందన్న అనుమానం రానే వచ్చింది. ఇంక దాచ్చానే ప్రయత్నం వృధా!

"నాన్నగారూ నేనింత వరకెన్నడూ బిడారు చూడనేలేదు. అమ్మను చూచి అలాగే మరికొంచెం పైకి వెళ్లి శమంతుని బిడారు కూడ చూచి రావాలనే బయలు దేరాను. బిడారు అనగా అందులో గొత్తరాహులనించి సేకరించి తెచ్చిన అపురూప వస్తు సంచయమంతా ఉంటుందట కదా.

అముదాలను కొలిచియిస్తే అంజభాలను మరిచి యిస్తారట బిడారును చూచేందుకు వెళ్ళటం నేరమా?" అని అడిగింది తుల్యభాగ. తండ్రి దగ్గర గారాలు పోతే ఆయన కరిగి పోతాడని ఆమెకు తెలుసు

ఆమె ఊహించినట్టుగా తండ్రి ఈ విషయంలో మాత్రం రవంత అయినా కరిగిపోలేదు మరింత దృఢంగా వ్యతిరేకించాడు

"నేరము అనుకునే కదా నాతో చెప్పకుండా దాచావు. నేరం కాదని భావిస్తే ముందుగానే నీవా సంగతిని నాతో ఎందుకు చెప్పలేదు. అమ్మా! తుల్య భాగా, మనసుకో తప్పు అనిపించే పనులు చేసేందుకు కూడ నీవు సంసిద్ధురా లవు అవుతున్నావన్న మాట?" అని ప్రశ్నించాడు.

తుల్యభాగ తన బాలికా చాపల్యం ప్రదర్శించిన అజ్ఞానాన్ని తలుచుకుని సిగ్గుతో తల దింపుకుని నేల చూపులు చూడసాగింది.

"మీకు గొత్తరాహులంటే కోపం. వారి దగ్గరకు పోతానంటే అంగీక రించరు. అందునించి అనృతమే పల్లించాను" అంది. అప్పటికే ఆమె కంఠం పూడిపోవటం ప్రారంభించింది.

(సశేషం)

# రంగు వెన్నెల

## బి. చంద్ర

"పెళ్లి చేసుకున్నావా!?"

బాధ, ఆశ్చర్యం, ఆత్రుతతో కలగా పులగంగా వుందా ప్రశ్న

"ఇద్దరు పిల్లలుకూడా" అన్నాను చిర్నవ్వు నవ్వుతూ.

అతని ముఖం క్షణకాలం రంగు మారింది. చింపిరి కాగితాలు పేర్చి చదివినట్టు ఏదో అని నవ్వాడు పుస్తకంలో ఓ పేజీని పర్రున చింపినట్టుగా

"ఇంటికి వెళదాంరా" అంటూ దారి తీసాను నేను

"సారీ.... రాలేను"

ఆగి ఆగి చెప్పాడు. నివ్వెరపోయి చూస్తున్నాను. అతని ముఖంలో ఇందాకటి నవ్వు అలాగే నవ్వుతూ.

"ఒంటరిగాడివైతే వచ్చేవాడ్ని" అన్నాడు.

"అర్థం కావటంలేదు" అన్నాను. నిజాన్ని నిజంగానే ఒప్పేసుకుంటూ.

అతను ఆలోచిస్తూ కాసేపాగి "ఒకందుకొస్తాను, కారణం కూడా అక్కడే చెప్తాను పద" అన్నాడు కరెంటు తీగెలకేసి చూస్తూ.

"ఏంచేస్తున్నావు" అడిగాను.

"సంపాదించటం కోసమైతే ఏమీ చెయ్యటంలేదు. పోగొట్టుకొన్న కాలాన్ని పెరిగే వయసుతో గుణించుకొంటూ ఆ రాసులమీదబతికేస్తున్నాను. ఒకటి ఇంటూ సున్న ఈజ్ ఈక్వెల్‌టు ఏమిటి?"

"అయితే ఆదిలోనే లెక్క తప్పన్న మాట."

ఇద్దరం నడుస్తున్నాం. అతను ఏమాలోచిస్తున్నాడోకాని నేను మాత్రం ముప్పైయ్యేళ్ళ క్రితం కర్నూలులో మేము చదివిన కాలేజీ ఆవరణలోకి తొంగిచూసాను.

o o o

"రెండేళ్లుగా నాతో చెడమడా తిరిగిన రాధ, మూడు రోజులుగా మాట్లాడ్డం మానేసింది గురూ ఏంచెయ్యమంటావు?"

"రాంనెంబరు ఇరవై ఏడు మన ఇంటర్‌స్టేట్ గేమ్స్ సెక్రటరి రఘుపతిని కలువ్ ఫో."

"సుందరికి వాళ్ళ నాన్న వేరే సంబంధం చూసొట్ట వచ్చేనెల నాలుగో తారీఖున పెళ్ళి. నా బతుకేంకావాలి?"

"ఇప్పుడు టైం ఎంత? పదింపావేనా? అయితే టెలివిజన్ కేఫ్‌లో టీ తాగుతుంటాడు రఘు త్వరగా వెళ్లు క్విక్"

"ఎకానామిక్స్‌లో ఎయిటీ ఫైవ్ పెర్సెంట్ సార్. బాబా కాలేజీలో అన్నీ ఖాళీలే కానీ డొనేషన్ లేందే సీట్ ఇవ్వనంటున్నాడు. కాస్త మీరొచ్చి చెప్పండిసార్"

"అవసరం లేదయ్యా స్టూడెంట్స్‌కి అక్కడ టెన్నిస్ కోచ్ వస్తున్నాడు రఘుపతిలావ్ కానేసాగి వెళ్ళి కలువ్"

"ఏమీ తోచడం లేదు"

"డాక్టర్ తెలుసా?"

"తెలియదు"

"ఏమిటి రఘుపతి తెలీదా? అయితే నీ ఖర్మ చావు"

ఇలా రఘుపతి పేరు హాస్టల్లో, కాలేజీలో, అందరి నోళ్లలో వూళ్లో గోడల మీద మారుమోగేది అతన్ని ఖాళీగా, కామ్‌గా చూసిన వాళ్ళు లెరు ప్రతి ఒక్కరి సమస్యల్ని అర్థంకాని "పజిల్" లాంటి విషయాల్ని చిటికెలో సాల్వ్ చేసేవాడు రఘు. మోడ్రన్ కంప్యూటర్ లాంటి మనిషి అతని క్వాలిఫికేషన్లనన్నింటిని కలిపి ఎలా పిలవాలో తెలియక చివరికి "డాక్టర్" అని బిరుదిచ్చి అలాగే పిలవడం అలవాటైపోయింది-లెక్చరర్స్‌తో సహా

ఎప్పుడూ టక్ చేసిన మాచింగ్ డ్రస్, చామనచాయ మొఖంలో కలిసిపోయినట్టుండే కొద్దిగా పెరిగిన గడ్డం నూటికి నూరుపాళ్లు ఇరవై అయిదు యేళ్ళ మనిషి అదే మనసు. నిజమైన యువకుడు రఘుపతి, అదే కాలేజీలో అతని సరయిన జోడీ "రేవతి" అని ఘంటా పథంగా చెప్పొచ్చు

గాలి మంచురూపంలో తెల్లగా కమ్ముకొని వున్నప్పుడు లోకం ఏడవనీ,నవ్వనీ గుండెపగిలి చావనీ అన్నట్టు కత్తులతో నడచే వీరుల్లా ఇద్దరి చేతుల్లో టెన్నిస్ బెట్‌లతో ఎన్ని ఉదయాల్ని, ఎన్ని జతల కళ్ళని "ఛట్"'పొమ్మన్నారు! . రేవతి నడుంచుట్టూ పూర్తిగా అతనిచెయ్యి మీద వాలి అతని భుజం ఆసరాతో కదిలే చందనపు చెట్టూ, దాన్ని పెనవేసుకొన్న అడవి తీగెలా తుంగభద్ర గట్టు మీద ప్రకృతికి అందాన్ని రాసులుగా పోస్తూ వాళ్లిద్దరూ ప్రేమికుల గుండెల్లో మతాబులు వెలిగిస్తూ ఎక్కడ చూసినా వాళ్ళిద్దరే

'మేం పెళ్ళి చేసుకుంటున్నాం'

రేపు-అనగా మన కాలేజి జన్మ దినోత్సవంనాడు కాలేజి ఆవరణంలో మేం నిర్ణయించుకొన్నట్టు ఉదయం అయిదూ యాభై అయిదు నిమిషాలకు దంపతులం కాబోతున్నాం.

ఇష్టం వున్నవాళ్లు రావచ్చు

ఇష్టం లేనివాళ్లు వాళ్లయిష్టంవున్నట్టు రావచ్చు.

ఇట్లు
రఘు. రేవతి,

ఓ సాయంకాలం చీకటి పెనుకులు రాల్తున్న వేళ మెరుపు చుక్కల్లా పత్రికలు పంచబడ్డాయి. చీమకూడా చావ లేదుకాని ఊరంతా స్మశానంలాగయి పోయింది.

సరిగ్గా ఆ సమయంలో తుంగభద్ర కాల్వ గట్టున ఎప్పటిలాగే నింపాదిగా ఇద్దరూ ఒక్కటై నిర్భయంగా నడుస్తున్నారు ఆ దృశ్యాన్ని చూసి రెండు చేతులెత్తి జన్మ ధన్యమయిందనుకొన్నాను అప్పుడు నా జేబులో ఆరోజు రాత్రి తొమ్మిది గంటలకు హైదరాబాద్‌కు బయలుదేరే ట్రయిన్ కు టిక్కెట్ లేకపోతే రేపు జరుగబోయే వింతనూ, సాహసాన్ని చూసేవాడ్ని కదా అని ఓపక్క బాధ పడ్డాను

చివరికి కర్నూలులో జయంతికి నామనసప్పగించేసి నాలుగేళ్ల పరిచయాన్ని, ప్రేమను నెమరు వేసుకొంటూ యింటికి చేరాను.

జయంతి, ఆనంద్‌లు ఎప్పటికి రఘుపతి, రేవతిలుకాలేరు, కారు అనుకున్న దానికి సాక్ష్యంగా ఇప్పుడు అశోక్‌నగర్ కాలనీలో "డాక్టర్ ఆనంద్ అనురాధా" అనే నేం ప్లేటు వి కాం. ఫైనల్ చదువుతున్న కొడుకు, ఇంటర్ సెకండియర్‌తో రెండవసారి పోరాడ తున్న కూతురు కనిపిస్తారు.

o o o

గుప్పుమన్న మల్లెపూలవాసన వన్నూ నా ఆలోచనల్ని వెనుక నుండి ముందుకు లాగింది రఘుపతి సిగరెట్ అంటించు కుంటున్నాడు చెర చెరా అంటుకుంటున్న సిగరెట్ కొసను చూసినప్పుడల్లా ఏదో దారుణం జరిగి పోతున్నట్టనిపిస్తుంది నాకు

రూపాయి కాగితం యిచ్చి పూల పొట్లాం కట్టించుకొన్నాను- పాతికేళ్ళ అలవాటు ప్రకారం.

రఘుపతి కాలి కింద పురుగు తిరుగాడు తున్నట్టు అసహనంగా కదిలాడు.

తెల్లటి పైజామా, లాల్చీ మాయ లేదు, కాని బాగా నలిగున్నాయి కాళ్లకు హవాయ్ చెప్పులు, లాల్చీ. మెడనుండి కిందికి వున్న గుండీలు కన బడకుండా బారుగా పెరిగిన గడ్డం. గడ్డం మొదట్లో నెరుపు ప్రారంభమై వెలిగే బల్బుకు నల్లకాగితం చుట్టినట్టుగా వుంది. పైకి ఎగదువ్విన క్రాపు,

మెడమీది నుంచి బుజాలు తాకే చోట రింగులు తిరిగింది దట్టంగా పెదవుల కిందికి దిగిన మీసాలు సిగరెట్టు పొగకి మాడిపట్లయి కావి రంగులో వున్నాయ్.

కాస్త దూరంలో నిలబడి సిగరెట్టు పీలుస్తున్న రఘుని పరిశీలనగా చూసేను గుర్తుపట్టనంతగా మారిపోయాడు మనిషి ఆ మార్పు నిన్న మొన్నటిదికాదు దానికి కనీసం నా కొడుకు వయస్సైనా వుండొచ్చు చిత్రం ఏమిటంటే నా దురుగా వస్తున్నఅతన్ని చూసి కూడా దాటిపోతున్నాను నేను. చటుక్కున చెయ్యి పెట్టి ఆపి "నీ పేరు ఆనందరావు కదూ!" అని అడిగాడు. అయోమయంగా చూస్తున్న నాకు తను చెప్పేదాకా తెలియదు అతను రఘుపతని. అన్నిటికంటేనన్ను ఆశ్చర్యంలో ముంచేస్తున్న విషయం ఏమిటంటే యిద్దరం కలుసుకొన్నాం. అది ముప్ఫయ్యేళ్ల తరువాత అర్ధగంట పైగా అయింది. తను ఒక్క ముక్క మాట్లాడం లేదు

నా చేతిలోని పూల పొట్లాన్ని చూస్తూ "పూలంటే నాకసహ్యం" అన్నాడు యెంత అసహ్యమో మొహంలో చూపిస్తూ.

"ఎందుకు ?"

"ఆడదంటే పరమ అసహ్యం

---

గనుక" అతని గొంతులో కసి కదం తొక్కుతుంది.

"రేవతంటే కూడానా ?" అడిగాను, నడుస్తున్నవాడు పక్కన ఆగి చూసాడు నన్ను

పులి మనిషి మీద దూకేటప్పుడు అలాగే చూస్తుందేమో ?

నాకు "మా ఆవిడంటే చాలా ఇష్ట" మన్నాను గేటుతీసి లోపలికి నడుస్తూ. తను మా యింటికేసి చూస్తూ మెల్లగా నడుస్తున్నాడు రోగుల్ని చూడ్డం మంచి సీళ్ళ ప్రాయమైన నాకు రఘుపతి కొద్ది కొద్దిగా అర్థమవుతున్నాడు.

కట్టడంలో మా యిల్లు మోడ్రన్ ప్లానే అయినా వాతావరణం మాత్రం పర్ణశాలను గుర్తుకు తెస్తుంటుంది, రఘుని తిన్నగా మేడ మీద నా గదికి తీసుకొచ్చి కూర్చోమన్నాను

సోఫాలో కూర్చుంటూ గోడ కేసి చూసి "నువ్వు డాక్టరివి కదా మరి" అంటు ఆగిపోయాడు

"డాక్టరునే కాని షష్టిలో పడుతున్న వాడ్ని పొద్దువాలిపోతున్నపుడు దీపం ముట్టించుకోవడం ఎంత అవసరమో, సహజమో, పెరిగే వయసు మనిషిని జయించి జీవిత సత్యాన్ని వెతడం కోసం పరిగెత్తడం కూడా అంతేకదా ! అయినా యీ విషయంలో నువ్వే నా కంటే ముందున్నట్టనిపిస్తుంది. అవునా ?"

రఘు నాకేసి సూటిగా చూస్తూ "దగా అంటే అర్థం తెలుసా నీకు" అని అడిగాడు.

"బహుశా జీవితం దాంతోనే మొదలవుతుందనుకుంటాను". నా మాట సగంలో వుండాగానే వెంటనే ఆవేశంగా "ఎందుకు నాశనం కావడానికా" అన్నాడు

నేను చిన్నగా నవ్వి "మేము పాయిజన్ని కూడా మెడిసిన్‌గా యూజ్ చేస్తాము తెలుసా ?" అన్నాను

"డాక్టరు కబుర్లు చెప్పకు నాకు నువ్వు జయంతిని ప్రేమించావు కదా".

"అవును"

"ఆమె కూడా నిన్ను ప్రేమించింది కదా"

తలూపాను.

"మరి పెళ్ళెందుకు చేసుకోలేదు ?" క్షణక్షణం అతని గొంతులో శబ్దం పెరుగుతూవుంది

"వాళ్ళ తల్లి దండ్రులకు ఇష్టం లేక పోయింది".

"ఆ విషయం వాళ్ళు చెప్పారా ? జయంతి కూడా చెప్పిందా ?". గది గోడలు ఖంగుమన్నాయ్

"అందరూ చెప్పారు, అందరి ముందు జయంతి కూడా చెప్పింది"

"వయసు, కులం, అంతస్తు,

చదువు అన్నింటిలోనూ ఇద్దరూ సమానులే కాదా అటువంటప్పుడు నిన్నంతగా ప్రేమించిన మనిషి ఎందుకు చెప్పిందో తెలుసుకున్నావా ?"

"ఇవన్నీ సరిగ్గావుంటే పెళ్లి జరిగిపోవలసిందేననీ, ఎంత ప్రేమించుకున్నా యిందులో ఏ ఒక్కటో లోపించి పెళ్ళి జరక్కపోతే సమంజసమేననీ యెలా అనుకుంటావు. అయినా ప్రేమించుకున్న ప్రతి జంటా పెళ్ళి చేసుకుంటేనే నిజమైన ప్రేమనానీ వుద్దేశం ?? ప్రేమకి ప్రతిరూపం పెళ్లేనా ??? ప్రతి పెళ్లికి ముందు ప్రేమ పునాది రాయా ? అదే నిజమైతే యిప్పుడు నువ్వు నేను యిలా మాట్లాడుకొనే వాళ్ళం కాదు. జయంతి మీద నాకున్న అధికారం కంటే, ఆమెకు నా మీదున్న ఆశక్తి కంటే, ఆమెమీద తల్లిదండ్రుల అధికారం, ఆమెకు వాళ్ళ మీదున్న గౌరవం - భక్తి ఏ పరిస్థితుల్లోనూ ఎక్కువే కదా ! ? ఆమెను నాకిచ్చి పెళ్ళి చెయ్యడం వాళ్ళ కిష్టం లేదు అయిష్టానికి కారణం ఏముంటుంది ? అయినా జయంతిని నేను ప్రేమించినప్పటి ఆనందానికి, అనుభూతికి, అనురాధను పెళ్లిచేసుకొం

కాపురం చేస్తున్న ఆనందానికి, అను భూతికి సంబంధం లేదు. అక్కడా, ఇక్కడా ప్రేమ సమృద్ధిగానే వుంది నా సంగతలావుంచు నీవాలకం అది చూస్తూంటే రేవతికి, నీకు పెళ్లి జరిగి నట్టు లేదు పత్రికలు కూడా పంచావు కదా? తరువాత ఏమయింది?"

రఘుపతి మరో సిగరెట్ వెలిగించి "దాహంగా వుంది కాస్త మంచి నీళ్ళివ్వు" అనడిగాడు కూజాలో నీళ్ళు గ్లాసులోకి ఒంపుతున్నాను

"ఆనందూ! ఒక్క విషయం చెప్పు జీవితాలు కథలా? లేక కథే జీవితమా,"

నీళ్ళగ్లాసు అతని చేతికిస్తూ" జీవితం ముందు, ఆనక మొదలవుతుంది కథ జీవితం- కాదంటావా?" అన్నాను

రఘుపతి నీళ్లు తాగి రుమాలుతో మూతి తుడుచుకుంటూ "నువ్వు చదివి నంత లిటరేచర్ నేను చదివుండక పోవచ్చు నేను చదివిన దాంట్లో బాగా గుర్తున్నదొకటుంది

ఆడ-మగ
ఒకరికొకరు
వత్తీ మంటలా
మగ-ఆడ
ఒకరికొకరు
మంటా వత్తిలా
ఇందులో ఏది నిజం?''

రఘుపతి చేతిలోనిగ్లాసందుకొని టీపాయ్ మీద పెడుతూ "ఇందులో ఏదీ అబద్ధం మాత్రం కాదు కానీ, మంట కావాలనుకుంటే వత్తి ముఖ్యం. వత్తే కావాలనుకుంటే మంట అక్కర లేదు రాసిందెవరోగాని గోడమీది పిల్లిలా వుంది వ్యవహారం, ఒకటి మాత్రం నిజం. జీవితం జీవించడానికి గతించడానికి- అలాజరగాలంటే మనిషి కావాలి, మండాలి మరి అలాం టప్పుడు జీవితం మంటలేని ఒత్తే అయితే ఎలా?"

రఘుపతి గడ్డాన్ని చేత్తో ఒక చివర సవరిస్తూ "నువ్వేదైనా చెప్పు నాకు మాత్రం ద్రోహం జరిగిందిరా ఆరోజు ఉదయం కాలేజీ కాంపౌండ్ లెక్చరెర్స్ స్టూడెంట్స్ వాళ్లోని పిల్లా-మేకతో నిండిపోయింది అందరి మధ్య నేను ధీరోదాత్త నాయకునిలా ఎంతో ఉత్సాహంగా నిల్చొని వున్నాను రేవతి తన బంధుమిత్రులతో సహా వచ్చింది ఆనందంలో తల మునకలౌతున్న నన్ను ఏంచేసిందో తెల్సా? తనే నన్ను ఉరి తీసినా బాగుండేదేమో, కాని అలా చెయ్యలేదు. అంతమంది ముందు నా యెదురుగా ఎవడో ముక్కు-మొఖం తెలియని మనిషిచేత తలవంచి తాళి కట్టించుకుంది- ఒక్క మాట, ఒక్క పలుకు, చివరికి ఒక్క చూపైనా నాకేసి



చూడకుండా తాడొకటి విసిరేసి నువ్వే ఉరిపోసుకుని చావు అన్నట్టు పోస్టు మార్టం చేసి ఒదిలేసిన శవంలానిల్చున్న చోటే కొయ్యబారి పోయాను నేను"

ఆతని మాటలు వింటున్న నా కళ్ళ ముందు అతని చెప్పిన దృశ్యం రూపు దిద్దుకుంటోంది. రఘుపతి తనలో తానే చెప్పుకుపోతున్నాడు

''మిస్ రేవతి నా ''ఫ్రెండ్'' అని ఎందరి ముందు ఛాతీ విరుచుకున్నాను। "రఘు ఆల్వేస్ ఇస్ ఎ లక్కీ ఫెలో"అని చిన్నా పెద్దా రేవతి ముందే నన్ను పొగిడారు నాకు జరిగినటువంటి శిక్ష కక్ష సాధింపు కనీసం ఏకధలో నైనా చదివావా? నేను రేవతిని దక్కించుకోలే నందుకు బాధపడలేదు. కానీ నాముందే తను పెళ్ళి చేసుకొని కాపురం చేస్తూ నాకు నరకం చూపిస్తుంది అదే నా బాధ".

"అయితే ఇదన్న మాట జరిగిన సంగతి. ఈ విషయంలో నాకు పెద్ద తేడా ఏమీలేదు."

"దానికి నేను నిరసనగా నేనేం చేస్తున్నానో తెలుసా" అన్నాడు రగుపతి తిరిగి సిగరెట్ వెలిగిస్తూ.

ఏం చేస్తానన్నట్టు చూసాను.

"తర్వాత నేను పెళ్ళి చేసుకోలేదు. నాజీవితాన్ని నా ప్రేమకు త్యాగం చేసాను"

నాగుండె రగుపతి మీద జాలితో నిండి పోయింది. దానిక్కారణం అతను త్యాగం అన్నందుకుకాదు. అనుకుంటూ తన్ను తాను మోసగించు కొంటున్నందుకు.

"సరే అయితే, నిన్ను ప్రేమించిన రేవతికి నిన్ను చేసుకునే అవకాశం ఏ పరిస్థితుల వల్లనో లేదనుకుందాం. వేరొకర్ని చేసుకొని కాపురం చేస్తున్నందులకు నీకు మరింత బాధ అలాంటప్పుడు నీకుబాధ కలగకుండా రేవతి ఏం చేయాలి మరి? ఏమిటి నీ ఉద్దేశం"

"ఒక్క పదం కోసం నా జీవితాన్ని నేనేం చేసుకొన్నానో తాను అంతే" మొండిగా చెప్పాడు రగుపతి

"అప్పుడు ఇద్దరు పిచ్చివాళ్లు తయారవుతారు తెలుసా?"

"అయితే నాది పిచ్చా" సోఫాలోంచి కాస్త లేచి నిలబడ్డాడు రగు

"కాకపోతే త్యాగం అనుకుంటున్నావా" నింపాదిగా అడిగాను

తానేమి మాట్లాడలేదు తిరిగి నేనే అన్నాను 'త్యాగం చేయడానికి నువ్వు ఎవరివి అలాంటి అధికారం ఎవరికీ లేదు ఒకరి జీవిత మార్గం, జీవిత విధానం, పద్ధతి ఇంకొకరికి త్యాగంలా కనిపించాల్సిందేం ప్ప మనిషి జీవితంలో త్యాగం అనే పదానికి చోటే లేదు "

రగుపతి నాకేసి వెర్రిగా చూస్తూ గొంతు పెగల్చుకొని "అయితే నా ప్రేమ

"ప్రేమ ప్రతి మనిషి పుట్టుకతోనూ మొదలవుతుంది. అందుకే యుగాలు మారినా ఎప్పుడూ కొత్తగానే వుంది. రెండేళ్ళ వయసులో పిల్లలు ఆడుకోకుండా వుండడం ఎంత లోపమో. ఇరవై అయిదేళ్ళ లోపున మనిషి ప్రేమలో పడకుండా వుండడం కూడా అంతే లోపం యాభై యేళ్ళ తరువాత కూడా పాతికేళ్ళ ప్రేమ తాలూకు అనుభూతి ఛాయల కోసం పలవరించడం అంతకన్న పెద్దలోపం ప్రేమ అన్న పదానికి అర్థం ఎప్పుడూ ఒక్కటే వయసును బట్టి అనుభూతులు మారుతుంటాయి. మారాలి కూడా. అదే నిజమైన ప్రేమ"

రఘుపతితో మాట్లాడుతూనే టేబుల్ బల్ల డ్రాయరు లాగి అడుగు తున్న ఓ ఉత్తరం, పైనే ఉన్న మరో ఉత్తరం తీసాను. చాలా యేళ్ళ తరువాత తిరిగి అడుగు నుండి తీసిన ఉత్తరాన్ని చదవాలనిపించింది

"మైడియర్ ఆనంద్

పారిదేన్ పూర్తయి రెండు రోజులయింది ఎందుకిలా చంపుతావు ?

నల్లకలువ రేకులు నీ కన్నులనీ,

సన్నజాజి పువ్వులు నీ నవ్వులనీ,

నువ్వు రాసిన మొదటి ఉత్తరం లోని వాక్యాలని ఎన్నిసార్లు చదివి

# పాపమునుండి విముక్తి ఎలా ?

మానవులెందుకు నీతి తప్పి నడుస్తుంటారు ? ఎందుకు చెడు మార్గమును ప్రేమిస్తుంటారు ? ఎందుకని తెలుసా ? పాపపు పనిలో కనిపించే ఆనందం, ఆకర్షణ వారికి పవిత్ర ప్రేమలో కనిపించదు కన్నులకు కనిపిస్తున్న ఈ స్వర్గాన్ని కాలదన్ని, కన్నులకు మరుగైన, ఆ స్వర్గం కోసం, ఇప్పటి నుండి ఎందుకు పరితపించాలి ? అని తమతో తామె సరిపెట్టు కొంటారు

తాను నడుస్తున్న మార్గం కంటకావృతం అని తెలుసు దీనివలన తన్ను నమ్ముకొన్న భార్యాబిడ్డలు, తన మీద వెర్రి ఆశలు పెంచుకొన్న వృద్ధ తల్లి తండ్రులు, తీరని ఆవేదనకు గురికాగలరని కూడ తెలుసు. త్రాగుడు. జూదం, పరస్త్రీ వ్యామోహంవలన, ధన వ్యయం, పరువు నష్టం అని కూడా బాగుగా తెలుసు. పాపం నిప్పువంటిది. నీవు తెలిసి ముట్టుకొన్నా, తెలియక ముట్టుకొన్నా నీ చెయ్యి కాలక మానదు. బాధ పెట్టినంత కాలం, మనిషిని బాధించి, చివరికి అసహ్యమైన మచ్చలుగా మిగిలిపోతాయి. అందుకే పాపమనే నిప్పుతో చెలగాటాలాడక దూరంగా తొలగిపోవటం శ్రేయస్కరం, అక్కడి నుండి దూరంగా తొలగిపోగలిగిన హృదయం కూడ దేవుని వలన కలగాలి దేవుని కృపవలన మార్పు చెందిన మనస్సే మనస్ఫూర్తిగా పాపాన్ని ద్వేషించగలదు పాపము వలన కలిగే భయం వలన గాని, రాబోయే శిక్షను తప్పించుకొనవలెననే కోర్కె వలన స్వాభావికముగానే ఈ పాప ద్వేషము కలుగుతుంది మీరు కూడా మీ హృదయములో మార్పు పొందగోరుచున్నారా ? అయితే మాకు వ్రాయండి.

| ఉచితం ! | ఉచితం ! |
|---|---|
| భగవత్స్వరూపుడు, కరుణామయుడు అయిన ఏసు క్రీస్తు జీవిత చరిత్ర, మానవాళికి ఆయన అందించిన కమనీయ బోధలు తెలియజేసే అందమైన పుస్తకం ఉచితంగా పొంద దలచుకుంటే, ఈ రోజే మీ చిరునామా మాకు వ్రాయండి వెంటనే పుస్తకం పంపుతాము. | డా॥ ఎస్. జాన్ డేవిడ్,<br>పోస్టుబాక్సు నెం. 14,<br>చిలకలూరిపేట,<br>గుంటూరు జిల్లా<br>(ఏ పి) |

Gospel Message

తృప్తిపడమంటావు? తుంగభద్ర కాల్వ గట్టున సగం తడిసిన నా పైట నీచేత్తో పట్టుకొని ఆరేసిన రోజు గుర్తు రావడంలేదా?? ఆనంద్ ఏ సి థియేటర్లో ఆదేదో భాష సినిమా, ఆ సినిమా చూసే వంకతో ఎన్నిసార్లు లోపల కూర్చున్నాం. మధ్యలో లైట్లారిపోయిన రెండవ రోజు అబ్బా.....సిగ్గు చంపేస్తుంది బాబూ. పోయిన జూలైతో పిక్నిక్ వెళ్ళినపుడు నన్ను అందరికీ దూరంగా తీసుకెళ్ళి ఆ సరుగుడు చెట్టు చాటున........నీ చేతులింకా నా భుజాల చుట్టూ వున్నట్టే వుంది. ఇక ఉత్తరం రాయలేను. ఎంతరాసినా ఎంతో కొంత మిగిలే వుంటుంది ఇంకా ఎన్నాళ్ళిలా నా కందకుండా వుంటావు ఆనంద్? ఎప్పుడొస్తావు? యింకా ఎన్ని రోజులా? ప్లీజ్ వెంటనే వచ్చేయ్. ఉత్తరం అందిన వెంటనే ముందో ఉత్తరం రాయి.

ఇట్లు నీ కోసం, నీ ఉత్తరం కోసం ఎదురు చూసే

—నీ జయంతి"

పెదవులు బిగించి నవ్వొంచుకున్నాను. రెండో వుత్తరం నిన్ననే వచ్చింది. దాన్ని చదవక్కరలేదు. అందులోని వన్నీ నాకు గుర్తున్నాయి. సగం ఉత్తరం నా ఆరోగ్యం గురించి, ఎంత డాక్టర్నయినా జాగ్రత్తగా ఉండమని, అనురాధకు బి. పి. ఎలా గుందంటూ పరామర్శ. తరువాత పెద్దాడ్ని ఏం చదివించాలనుకుంటున్నావు, సి ఎ.లో చేర్పించమని సలహా. పిల్ల ఈ సారయినా పాసయే సూచనలు కల్పిస్తున్నాయా అన్న ఆశా భావం తన భర్త సిగరెట్లు తెగకాలుస్తున్నాట్ట. ఈసారి వూరొచ్చినపుడు నన్ను గట్టిగా చెప్పమంది డక్టరుగా. తనకి రెండు నెలల్క్రితం బెణికిన కాలు ఇంకా సర్దుకోలేదట. ఇలా వుందా ఉత్తరం.

నేను మౌనంగా కాసేపు ఆ రెండు లెటర్స్‌ని చూసి "ఈ రెండు చదువుతూ వుండు" అని రఘుపతి చేతికిచ్చి మెట్లు దిగి కిందికొచ్చాను.

ముప్ఫయేళ్ళ తరువాత చాలా ముఖ్యమైన స్నేహితుడు కలిసాడని వంటింట్లో వున్న అనురాధకు చెప్పి కాఫీ కలపమన్నాను. కాసేపటికి కాఫీ నింపిన రెండు కప్పులతో వచ్చి మీరు తీసికెళతారా అంది. "నువ్వేరా మీ యిద్దరిని పరిచయం చేస్తాను" అంటూ శ్రీమతితో మెట్లెక్కాను గదిలో సోఫా మీద చడివి మూసినట్టుగా రఘుపతి కూర్చున్నచోట నేనిచ్చిన రెండు ఉత్తరాలు, ఒకదాని మీద ఒకటి పడి వున్నాయి. నా శ్రీమతి దిక్కులు చూస్తోంది ... అతనికోసం వెతుకుతున్నట్టుగా- "కాఫీ" ఎంతసేపు "వేడిగా" వుంటుంది?!



# హత్యలు-అల్లర్లు చేసే సునిశిత మనస్కులు




పిల్లలు పుట్టగానే వాళ్లు డాక్టర్లో, ఇంజనీర్లో, కలెక్టర్లో అవ్వాలని తల్లిదండ్రులు రకరకాల కలలు కంటారు.

తమ కలలు ఫలించటం కోసం శాయశక్తులా కృషి చేస్తారు.

అలాంటిది తమ కళ్ళముందే తమ సంతానం హంతకులుగా కిడ్నేపర్స్‌గా భయంకర కృత్యాలుచేసే ముఠా నాయకులుగా మారుతుంటే ఆ తల్లితండ్రుల బాధ యింక చెప్పక్కర్లేదు యిలా మారుతున్నది చదువు సంధ్యా రాక, తెలివితేటలు లేని బడుద్ధాయిలు కాదు యూనివర్సిటీలలో మంచి తెలివైన వాళ్ళని పేరు పొంది భవిష్యత్తులో సమాజానికి ఎంతగానో ఉపయోగపడతారని ఎందరో ఆశ పడుతున్న యువతీ యువకులు తల్లితండ్రుల బాధ కళ్ళారా చూస్తున్నా ప్రపంచంలో పలుచోట్ల చాలా మంది యువతీ యువకులు తమ హింసా ప్రవృత్తి వొదలటం లేదు వాళ్లు నడుస్తున్నది పూలబాట కాదు. ముళ్లదారే అయినా వాళ్లకి అదే తృప్తి. అదే జీవిత విధానంగా మారింది బతుకు బూడిదగా మారుతున్నా, యవ్వనం ఎగసిన మంటలా గడవటమే వాళ్ళకి కావాలి

వీళ్ళలో చాలామంది మంచికుటుంబాలకి చెందినవాళ్ళే జీవితంలో సకల సౌకర్యాలు ఉన్నవాళ్ళే. ఇరవై యిరవై అయిదేళ్ళ వయసు వరకూ ఎంతో నార్మల్‌గా వుండేవాళ్ళు ఏదో వోనాడు హఠాత్తుగా మారిపోతున్నారు ఆ తర్వాత వాళ్ళజీవితం వాళ్ళదికాదు ఏదో ఒక ముఠా నియంతృత్వం వాళ్ళని నడిపిస్తుంది ఇలా టెర్రరిస్ట్ ముఠాల పాలైన వాళ్ళలో కొందరు జైళ్ళలో మగ్గుతున్నారు, మరికొందరు ఏళ్ల తరబడీ అజ్ఞాతవాసం చేస్తున్నారు ఇంకా కొందరు ఉరికంబం ఎక్కారు. మరి కొంతమంది ఆత్మహత్య చేసుకున్నారు

ఇలా ఎందుకు జరుగుతోందని ప్రపంచం నలుమూలలా చాలామంది మేధావులు ఆలోచిస్తున్నారు పరిశోధిస్తున్నారు.

పట్టూ జరుగుతున్న అన్యాయాన్ని సహించలేకపోవటం ఏదో చేయాలన్న తపన స్థబ్ధతని ఛేదించలేని ఆవేశం నిస్పృహ, యిలా యివన్నీ కొన్ని కారణాలు మాత్రమే ఏది ఏమైనా యిది ఎవరూ ఆపలేని ఓ జీవిత ప్రవాహంగా మారింది ఎన్నో రంగాలుగా సహానానికి వుపయోగపడాల్సిన మేధాశక్తి వున్న వీళ్ళు ముఫ్ఫై ఏళ్ళు నిండకముందే ప్రాణాలు పోగొట్టుకోవటం అందరికీ బాధే.

వీళ్ళు చేసేవి చిన్న చిన్న అల్లర్లు, ఆలజడులు కావు చాలా ప్రముఖుల్ని ఎత్తుకు పోవటం, చంపట, పెద్ద పెద్ద భవనాల్ని తగలపెట్టటం వాళ్ళు చేసే పనులు ప్రపంచానికి ప్రస్ఫుటంగా తెలియాలి ముఖ్యంగా వాళ్ళకి కావాల్సిందది

సెన్‌జిరో ఫ్లోరెన్స్ యూనివర్‌సిటీలో సోషియాలజీ ప్రొఫెసర్ చాలా మంచి వాడని పేరు. బాలబాలికల జైళ్ళకి వెళ్ళి పరిశోధించి వాళ్ళ భవిష్యత్తుకి తోడ్పడే విద్యావిధానాన్ని రూపొందించే ప్రణాళికా రచనకి వీలుగా ఎప్పుడుపడితే అప్పుడు అన్ని జైళ్ళకి వెళ్ళటానికి ప్రభుత్వం యితనికి ప్రత్యేక అనుమతి యిచ్చింది రోమ్‌లో యితని యింటిమీద పోలీసులు దాడి జరిపాక ఆశ్చర్యకరమైన విషయాలెన్నో బైట పడ్డాయి U S జనరల్ డీ ఓజైర్‌ని కిడ్‌నేప్ చేసింది యితని ప్లాన్‌మీదే యితనిల్లు ఓ చిన్న ఆయుధగారం అంతేకాక మరో పందమంది రాజకీయ నాయకుల్ని చంపటానికి తయారు చేసిన సమగ్ర పథకాలు కూడా యితని దగ్గర పోలీసులకి దొరికాయి ఇతని పథకం ప్రకారం జనరల్‌ని అపహరించిన వాడు ఆ ముఠాలో ప్రముఖుడు యాంటోనియో సావస్తా కిడ్‌నాప్ చేసేమిటి యితన్ని అరెస్ట్ చేశారు అంతేకాక ప్రధాని ఆల్డోమోరోని ఎత్తుకుపోయి హత్యచేసిన నేరంలో కూడా వీళ్ళిద్దరికి ప్రముఖ పాత్ర వుందని పోలీసుల నమ్మకం

ప్రపంచంలో మొత్తమంతా భయంకర టెర్రరిస్ట్ ముఠాగా పేరుపొందిన బాదర్ మెన్‌హోఫ్ ముఠాలో బాదర్ మగవాడు. ఉల్‌రైన్ మెన్‌హోఫ్ ఆడది టెర్రరిస్టుగా ఆమె పేరు మారుమోగింది ఎన్నో హత్యలు కిడ్‌నేప్‌లు చేసి చివరికి జైలులో ఆత్మహత్య చేసుకుంది జర్మనీ, యిటలీలో కాదు ప్రపంచం నలుమూలలా టెర్రరిస్ట్‌లు విస్తరిస్తూనే వున్నారు

కారణాలు ఏవైనా వీళ్ళంతా హింసా ప్రవృత్తికిలోను కావటానికి కారణం సున్నితమైన వాళ్ళ మనసే ప్రధాన కారణం అన్నది యించు మించు ప్రపంచంలో అందరు మనస్తత్వ శాస్త్రవేత్తలు చెప్తున్న సత్యం ★

# (అ) నాగరికత

పెళ్ళి చూపుల్నాడు :- నవ నాగరికత పుట్టిపడ్డట్టు డ్రసప్ అయ్యేడు. కానీ అమ్మబాబోయ్ బొంబాయిలో వుద్యోగమే ..ఎలా వుంటుందో ఆయనతో జీవితం.....

బాజాలూ - బజంత్రీలు .. "విష్ యూ హేప్ మేరీడ్ లైఫ్"

హేన్నీమూన్ కపుల్ :- మెరీన్ డ్రయివ్, ఎలిఫెంటా కేవ్స్, హేంగింగ్ గార్డెన్స్

సంసార సాగరం :- బుజ్జిగాడు పాలసీసాలు రేషన్ క్యూలు

(బి) నాగరికత :- "నీ అంత పల్లెటూరి దాన్ని బొంబాయి తీసుకొచ్చేను"

"అవును. ముందే మనకా సంగతి తెలుసు"

"మాటకు మాట జవాబిస్తున్నావు"

"వున్నమాటన్నాను. పెళ్ళయి మూడు సంవత్సరాలైంది. ఆ మాత్రం చనువు అధికారం నాకు లేవా ?"

"మాటలు నేర్చేవు"

"మీరీమాట అంటారని పెళ్ళికి ముందే ఆలోచించేను"

"నీ జాగ్రత్తలో నువ్వున్నావన్నమాట"

(పెరిగిపోతున్న ఈ అనాగరికతకు ముగింపిచ్చినా వాస్తవానికి దూరం అనిపిస్తుంది - అందుకే ముగింపు పాఠకులకే వదిలేస్తున్నాను) ★

గుడిమెట్ల గోపాలకృష్ణ

# ఓ అనుభవం కావాలి!



వి. మోహన్ కుమార్

---

### జరిగినకథ

(పరబ్రహ్మం ప్రకాష్‌ని ఆనందరావుకి పరిచయం చేసేడు. ఆనందరావు తన కంపెనీ సర్వం సహాధికారం ప్రకాష్‌కి ఇచ్చినంత పనిచేశాడు. లక్ష్మి విషయం ప్రకాష్ పక్కన పెట్టేశాడు. ప్రకాష్ తన అభిప్రాయం చెప్పేశాడు సదాశివరావుకి. అనుమానం వొచ్చి లక్ష్మితో ప్రకాష్ గురించి అడిగింది పార్వతమ్మ. లక్ష్మి ప్రకాష్‌ని సూటిగానే అడిగింది. కళ్ళు తెరిచింది పరబ్రహ్మం కూడికల ప్రకారం స్వప్నని కలిసేలా ప్రకాష్ మకాం ఏర్పాట్లు చేసేడ. థియరీ ఆఫ్ ప్రాబబులిటీ సక్సెసయినట్టే ..)

---

### జరుగుతున్నకథ

ఇదే కాలేజీ ఆఫ్ ప్రేమిస్ట్రీ

ప్రేమాలయం

యువతీ యువకులకు రామాలయం

ఆగండి......రండి

ఆశ్చర్యంగా ఆ బోర్డుని చూసాడు ప్రకాష్.

"ఇదేనా సార్" అన్నాడు మోటార్ సైకిల్ నడుపుతున్న కుర్రాడు. మోటర్ సైకిల్ గేట్లోంచి లోపలికి వెళ్ళింది గుబురుగా ఉన్న చెట్లలోంచి ఆ పెంకుటింటి దగ్గరకెళ్ళి ఆ ఇంటిముందు ఆగింది. ప్రకాష్ దిగి ముఖానికి పట్టిన చెమటని తుడుచుకున్నాడు.

"అబ్బ! చెట్లకింద చల్లగా ఉంది" అన్నాడు ప్రకాష్

"లోపలికి వెళదాం రండి, లోపల ఇంకా చల్లగా ఉంటుంది." మోటర్ సైకిల్ని పార్క్ చేసి అతను లోనికి నడిచాడు. ప్రకాష్ అతన్ని అనుసరించాడు. క్లాస్ జరుగుతోంది. పరబ్రహ్మం బోర్డుమీద వ్రాస్తున్నాడు. వాళ్ళు అలికిడి చెయ్యకుండా లోపలికి వెళ్ళి కూచున్నారు.

పరబ్రహ్మం వ్రాయడం ముగించి వెనక్కి తిరిగాడు.

బోర్డుమీద నాలుగు ఈక్వేషన్లున్నాయి.

sr+sl——srsl

srsl——sr+sl

Rr+r srsl—Rrsl±sr

srsl+RrRl ——SrRl+RrSl

ప్రకాష్కి అవి అర్థం కాలేదు అయినా అందరిలాగే నోట్ చేసుకున్నాడు.

"ఇవి కెమిస్ట్రీలో ఈక్వేషన్లు కావు. ప్రేమిస్ట్రీలో ఈక్వేషన్లు. రసాయన చర్యల్లాగే ప్రేమాయణ చర్యలుకూడా నాలుగు రకాలు.

ఒకటి : సంయోగము ఇంగ్లీషులో Synthesis అంటారు. ప్రేమిస్ట్రీలో అత్యంత సరళమైన చర్య ఇది. సుబ్బారావు అనే అబ్బాయి (sr)




సుబ్బలక్ష్మి అనే అమ్మాయి (sl ) కలుసుకున్నారనుకోండి వారి మనసుల మధ్య జరిగే ప్రేమాయణ చర్య ద్వారా వాళ్ళు సుబ్బారావు సుబ్బలక్ష్మి అనే విడివడని జంటగా రూపొందుతారు. ఆ జంట ఎరిగి గంతేస్తుంది. అందువల్ల | గుర్తు పెట్టాను దీన్నే....

sr + sl——srsl

అని వ్రాస్తాను

రెండోది వియోగము దీన్ని ఇంగ్లీషులో Decomposition అంటారు ప్రేమిస్ట్రీలో బాధకరమైన చర్య ఇది ట్రాజడీ సుబ్బారావు సుబ్బలక్ష్మిల్ని చిన్నప్పుడే వీళ్ళు కాబోయే భార్యా భర్తలు అని పెద్దవాళ్ళు ముద్ర వేసేస్తారు తీరా వీళ్ళు పెరిగి పెద్దయ్యాక జరిగే ప్రేమాయణ చర్యమూలంగా వాళ్ళిద్దరూ సుబ్బారావు, సుబ్బలక్ష్మి అనే ఒంటరి జీవుల్లా విడిపోతారు' ఇది ట్రాజిడీ కాబట్టి | గుర్తుపెట్టాను దీన్ని.

sr sl —sr | + sl |

అని వ్రాసాను.

ఇది వినగానే కంగారు పడ్డాడు-

"ఈ రెండు ప్రక్రియల్లో చర్య ప్రేమికుల మధ్యే జరుగుతుంది. మూడో మనిషి చర్యలో పాల్గొనడు. అయితే ఇక మిగిలిన రెండు చర్యల్లో మూడోమనిషి (మనుషుల) ప్రమేయం ఉంటుంది. వీటిని చూద్దాం.

ప్రేమ స్థానభ్రంశం: ఈమూడోరకంచర్యని ఇంగ్లీషులో Displacement of Love అంటారు. సుబ్బారావు (sr) సుబ్బలక్ష్మి (sl) అనేజంట (srsl) మధ్య రామారావు (Rr) అనే మూడోవ్యక్తి ప్రవేశించాడనుకోండి- ఆతర్వాత జరిగే ప్రేమయాణ చర్యద్వారా రామారావు సుబ్బలక్ష్మి (Rrsl) అనే కొత్తజంట ఏర్పడుతుంది సుబ్బారావు ఒంటరిగా మిగిలిపోతాడు. ఇదే స్థానభ్రంశమంటే అందువల్ల జంటలు మూడోమనిషి అది మగవాడైనా ఆడదైనా జాగ్రత్తగా ఉండాలి. దీన్ని

Rr + srsi——Rrsl + sr
అని వ్రాసాను.

సుబ్బారావు దగ్గర ఉన్న | గుర్తు విషాదాన్ని సూచిస్తుంది.

ఇక నాలుగో చర్య ద్వంద్వవియోగం, ఇంగ్లీషులో దీన్ని Double Decomposition అంటారు.

సుబ్బారావు సుబ్బలక్ష్మి (sr sl), రామారావు రామలక్ష్మి (Rr Rl) అనే రెండో జంటలు కలుసుకున్నాయనుకోండి. ప్రేమాయణ చర్య మూలంగా ప్రేమ ప్రాతిపదికలు మారిపోయి సుబ్బారావు రామలక్ష్మి (Sr Rl),రామారావు సుబ్బలక్ష్మి (Rr Sl) అనే రెండు కొత్త జంటలు ఏర్పడతాయి మళ్ళీ ఆజంటలు ఒకరి కొకరు ఎదురైనప్పుడు వారి పరిస్థితి ఊహించండి.

అయితే జంటలు విడిపోయినా కొత్త జంటలు ఏర్పడ్డాయి కాబట్టి ఈ చర్య వియోగము స్థానభ్రంశము కన్నా మెరుగు. అందువల్ల దీంట్లో రెండు జంటలకి | గుర్తు పెట్టాను. ఇది ఇలా ఉంటుంది.

srsl + RrRl—srRl | + Rrsl

దీంట్లో సారాంశం ఏమిటంటే ప్రేమలో పడ్డవాళ్ళు తమ ప్రేమ సంయోగమో, వియోగమో తేలేంత వరకు దాని గురించి ఎవరికీ చెప్పకుండా ఉండడం మంచిది. లేకపోతే ప్రేమ స్థానభ్రంశం చెందే అవకాశం ఉంది"

"ఒక ప్రశ్న" ఓ కుర్రాడు లేచాడు అందరూ అతని వైపు చూసారు.

"సార్ ప్రేమ సంయోగానికి దారి తియ్యాలన్నదే కదా ప్రేమిస్ట్రీ సారాంశం "

"అవును ఓ అమ్మాయి అబ్బాయి ప్రేమలో పడ్డాక వారి మధ్య జరిగే ప్రేమాయణ చర్య 'సంయోగానికి' దోహదం చెయ్యాలి అలా దోహదం చేస్తే పరిస్థితుల్ని మనం సృష్టించుకోవాలి అదిఎలా? అన్నదే ప్రేమిస్ట్రీ చెప్పేది"

నా ఉద్దేశంలో ప్రేమ సంయోగానికి దారితీస్తుందా లేదా వియోగం వైపు వెడుతుందా అన్నది పరిస్థితులకన్నా 'అమ్మాయి అబ్బాయిల మీద ఎక్కువ ఆధా

పడిఉంటుంది ఫలానా అమ్మాయితో ప్రేమ సంయోగానికి దారితీస్తుంది,- ఫలానా అమ్మాయితో నియోగంలో పడేస్తుంది- అన్నవిషయం ముందే ఎలా తెలుస్తుంది"

ఆ అబ్బాయి మ టల్ని అందరూ ఆస క్తిగా విన్నారు.

ప్రేమికులందరి మొదటి సమస్య అదే!

జీవితంలో కామెడీ కావాలనే ప్రేమలో పడతారు అందరూ. అయితే అన్ని ప్రేమకథలూ కామెడీలు కావు.

పరబ్రహ్మం ఓ క్షణం ఆలోచించాడు.

మొదటి చూపులో కలిగే ఆకర్షణని తొలి వలపు లేదా తొలిచూపు వలపు- ల´ ఎట్ ఫస్ట్ సైట్ అంటారు తొలివలపుకి ఆధారం శరీరాకర్షణ

ఎలాంటి పర్సనాలిటీ అంటే అమ్మాయిలు ఇష్టపడతారు అన్న విషయం మీద అబ్బాయిలకి చాలా ఆపోహలున్నాయి. ఒక సర్వేలో "మీలో ఏంచూసి అమ్మాయిలు మీరంటే ఇష్టపడతారని మీరనుకుంటున్నారు" అన్న ప్రశ్నకి అబ్బాయిలు ఇచ్చిన మార్కులు- "మగవాళ్ళలో మిమ్మల్ని ఆకర్షించేది ఏది" అన్న ప్రశ్నకి అమ్మాయిలు ఇచ్చిన మార్కులు ఇలా ఉన్నాయి

| | మార్కులు | |
|---|---|---|
| | అబ్బాయిల ఊహ | అమ్మాయిల అభిప్రాయం |
| పొడుగు | 13 | 5 |
| విశాలమైన వక్షం | 21 | 1 |
| కండలు తిరిగిన చేతులు | 18 | 0 |
| కళ్ళు | 4 | 11 |
| సన్నటి నడుం | 7 | 15 |
| చదునుగా ఉన్న పొట్ట | 9 | 39 |
| చిన్న పిరుదులు | 4 | 13 |

సాధారణంగా ఆరడుగుల పొడుగుతో, విశాలమైన ఛాతీతో, కండలు తిరిగిన చేతులతో ఠీవిగా ఉండే మగవాళ్ళంటే ఆడవాళ్ళు పడిచస్తారన్న అభిప్రాయం ఉంది. అందుకే నవలల్లో హీరోని అలా వర్ణిస్తారు. అలాంటి మగవాళ్ళంటే అమ్మాయిలకి ఆరాధన ఉండచ్చు అయితే నిజజీవితంలో ప్రేమించేటప్పుడు ఏ అమ్మాయేనా తనకి తగ్గవాణ్ణే ఎన్నుకుంటుంది అయిదడుగుల అమ్మాయి సిక్స్‌ఫుటర్ని లైక్ చెయ్యదు. అలాగే బక్కపల్చగా ఉన్న అమ్మాయి కండలు తిరిగిన పోరగాణ్ణి కన్నెత్తి చూడదు చాలామంది అమ్మాయిలు తమకన్నా ఆరంగుళాలు ఎత్తుగా ఉన్నవాడ్ని, తమకన్నా కొంచెం లావుగా ఉన్నవాడ్ని తమకు తగిన వ్యక్తిగా భావిస్తారు. అయితే సన్నటి నడుం లోతుగా ఉన్న పొట్ట చిన్న పిరుదులు ఉన్న వ్యక్తంటే అందరూ ఇష్టపడతారు కళ్ళలో మెరుపుకి ఆకర్షితులౌతారు. శరీరం రంగు విషయంలో అమ్మాయిల అభిప్రాయం వేరుగా ఉంది. తెల్లగా ఉన్న అమ్మాయి అబ్బాయి రంగును గురించి పట్టించుకోదు. కాని నల్లగా ఉన్న అమ్మాయి తెల్లగా ఉన్న అబ్బాయంటే ఇష్టపడుతుంది. (కారణం తనకి పుట్టే పిల్లలు తెల్లగా ఉండాలి అన్న కోరిక కావచ్చు) ఇది ఆ సర్వేలో తేలిన విషయాలు.

ఈ సంగతులు ఎంతమంది మగవాళ్ళకి తెలుసు?

ఇక అమ్మాయిలో ఏం చూసి అబ్బాయిలు ఆకర్షితులవుతారో అన్న విషయం గురించి తర్వాత చెప్తాను

అసలు ప్రేమకి శరీరాకృతికి, శరీరపు రంగుకి ఏమీ సంబంధం లేదని, ప్రేమ హృదయానికి సంబంధించినదని అనుభవజ్ఞులైన ప్రేమికులందరూ ఒప్పుకుంటారు, కుర్రాళ్ళకి చెపుతూ వుంటారు కొన్నాళ్ళు పోయాక మీరు అదే మాట అంటారు. అది అనుభవం అది వచ్చేంతవరకూ తొందరపడవద్దు తొందరలు ఎవరికేనా తప్పవు మీరు అమ్మాయిల జోలికి పోయేముందు నేను చెప్పినవి గుర్తుపెట్టుకుని మీకు సరిపోతారు అనుకున్న అమ్మాయి ప్రేమకై ప్రయత్నిస్తే సక్సెస్ అయ్యే అవకాశాలు పెరుగుతాయి" పరబ్రహ్మం కూర్చున్నాడు.

"సార్ లవ్ ఎట్ ఫస్ట్‌సైట్‌లో నా అనుభవం చెప్తాను" మూడో వరుసలోంచి లేచి నుంచున్న అతని వైపు అందరూ ఆసక్తిగా చూసారు.

"నేను ఓ అమ్మాయిని చూసాను. ఇందాక మీరు చెప్పిన విషయాలన్నీ అందులో మా ఇద్దరికీ సరిపోయింది. ఆ అమ్మాయికూడా నన్ను అప్పుడప్పుడు ఆసక్తిగా చూడ్డం గమనించాను. ఆ అమ్మాయి పట్ల ఆకర్షణ ఎంతవరకు పోయిందంటే ఆ అమ్మాయి కనిపిస్తే చాలు కళ్ళు పక్కకి తిప్పుకోలేక పోయే వాడ్ని. మొన్న ఆ అమ్మాయి దగ్గరకెళ్ళి మాట్లాడబోయాను. ఆ అమ్మాయి చికాగ్గా వెళ్ళిపోయింది. కారణం అర్థం కావడం లేదు," ఆ అబ్బాయి దిగులుగా అన్నాడు.

"మీలో ఎవరికేనా అర్థమైందా" పరబ్రహ్మం పిల్లలకేసి చూసాడు. ఇంకో కుర్రాడు లేచాడు.

"ఆ అమ్మాయి అలా ప్రవర్తించడానికి కారణం ఇతను ఆ అమ్మాయివైపు అలా గుచ్చి గుచ్చి చూడ్డం. తమకేసి అదేపనిగా చూసే వాళ్ళకన్నా బెట్టు చేసే వాళ్ళని అమ్మాయిలు ఎక్కువ ఇష్టపడతారు " అతను ముగించాడు.

---

"నో సర్ - ఇతను చెప్పింది అబద్ధం. దానికి ఆధారం నా అనుభవం" మరో కుర్రాడు లేవడంతో క్లాసులో అందరూ అతని వైపు తిరిగారు "నేను మొట్టమొదట అలాగే అనుకున్నాను. ఓ ఏడాదిక్రితం నాకో అమ్మాయి తటస్థ పడింది. నేను కనిపించినప్పుడల్లా ఆ అమ్మాయి నావైపు చూస్తూ ఉండేది. ఆ అమ్మాయి నావైపు ఆశగా చూస్తోందేమో అనిపించేది నాకు. నాకూ ఆ అమ్మాయి వైపు చూడాలని, ఆమెతో మాట్లాడాలని ఉండేది అయితే ఆలా తేలిగ్గా బయటపడేవాడికన్నా బెట్టుగా ఉండేవాణ్ణి అమ్మాయిలు ఎక్కువ ఇష్టపడతా రన్న ఉద్దేశంతో నేను ఆమెను పట్టించుకోనట్టుగా ప్రవర్తించాను గతవారం ఆ అమ్మాయి మరో అబ్బాయితో ఇష్టంగా మాట్లాడ్డం చూసాను కాబట్టి బెట్టుచెయ్య డం తప్పు" అతను కూర్చున్నాడు.

"ఈ రెండు కేసులు విన్న తర్వాత మీకేమనిపిస్తోంది. అమ్మాయిపట్ల బెట్టుగా ఉండాలా లేక బేలగా ఉండాలా" పరబ్రహ్మం అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు

"నేను చెప్తాను వినండి తనవైపు కన్నెత్తి కూడా చూడని మగాణ్ణి ఏ ఆడది ప్రేమించదు. అయితే అందరికీ తెలిసేలా తనవైపు చూసే మగాణ్ణి ఏ అమ్మాయి క్షమించదు. కాబట్టి ప్రేమించాలనుకునేవాడు అమ్మాయివైపు ఆరాధనగా చూడాలి అయితే ఆ చూపులు, వాటిలో సంకేతాలు ఆ అమ్మాయికే పరిమితం కావాలి. ఇంకో కంట పడకూడదు"

పరబ్రహ్మం కళ్ళజోడు సవరించుకుంటూ ఆపులించాడు. ప్రకాష్‌కి క్లాసు సరదాగా అనిపించింది పరబ్రహ్మాన్ని చూసి చిరునవ్వు నవ్వాడు, స్టూడెంట్స్‌లో కూర్చున్న అతనికి ఏ ప్రత్యేకతా ఇవ్వలేదు పరబ్రహ్మం.

క్లాసయింతర్వాత పరబ్రహ్మంతో కాసేపు పిచ్చాపాటి మాట్లాడి ఇంటి ముఖం పట్టాడు ప్రకాష్

# 12

ఆ ఇంటికి వేసున్న పెద్ద తాళం కప్పని చూడగానే ప్రశాంత్‌కి ఎక్కడలేని నిస్సత్తువ ఆవరించుకుంది, ఒక్కక్షణంపాటు తలపట్టుకుని మెట్లమీద కూర్చుండిపోయాడు. కళ్లు తిరిగినట్టు చుట్టూ చీకటయిపోయినట్టు అనిపించింది.

కాస్సేపటికి తెప్పరిల్లి లేచి పక్కవాటా వాళ్ళ తలుపు తట్టాడు.

"ఎవరు కావాలి ?" తలుపు తెరిచి అడిగాడు పక్కింటాయన

"శ్రీకాంత్"

"అతను ఊరెళ్ళాడు. ఈ వారం చివరకాని రాడు"

ప్రశాంత్ ఊపిరి బిగబట్టి "థాంక్యూ" అన్నాడు

---








బయల్దేరడం ఆ మధ్యే అయినా ఆలస్యంగా చేరిన బాపుగారి కార్టూన్

వారాంతం అంటే ఇంకా అయిదు రోజులు. తన దగ్గరున్న డబ్బులు ఎంతో జాగ్రత్తగా వాడినా అయిదు రోజులు తిండికి సరిపోవు ఇక ఉండే దెక్కడ ? ఆలోచిస్తూ ఆ ఇంట్లోంచి బయటకు వచ్చాడు. యెదురుగా టీ కొట్టు కనిపించింది, కడుపులో ఆకలి విజృంభించింది. ఏదెన్నా తినాలనిపించింది కాని ఇంకా అయిదు రోజల్ని తలుచుకోగానే ధైర్యం చాలలేదు ఏమీ తినకుండా గుక్కెడు టీ తాగితే ఆకలి చస్తుందేమో! ఆశపడ్డాడు ప్రశాంత్ రోడ్డు దాట బోయాడు. అంతలోశరవేగంతో మలుపు తిరిగినకారు కనిపించింది. రోడ్డుమధ్యలో ఉన్న ప్రశాంత్ దాన్ని తప్పించుకోవడానికి వెనక్కి పరుగెత్తబోయాడు అంతే క్షణం తర్వాత ఏం జరిగిందో తెలియలేదు

o o o o

భారంగా కళ్లు విప్పిన ప్రశాంత్కి తెల్లబట్టలు వేసుకున్నతను కనిపించాడు అతని నెత్తిమీద తెల్లని టోపీ ఉంది, చూడబోతే కారు డ్రైవర్లా ఉన్నాడు అతను ప్రశాంత్వైపు ఆత్రుతగా చూస్తున్నాడు. ప్రశాంత్ తల భారంగా ఉంది పక్కన నర్స్ ప్రశాంత్ తలమీద చెయ్యివేసింది

---

"ఎలా ఉంది ?" అడిగిందామె.

ప్రశాంత్‌కి అంతా అయోమయంగా ఉంది.

"నేనెక్కడ ఉన్నాను" అన్నాడు మగతగా. అతనికి అంతా గందరగోళంగా ఉంది.

"ఆస్పత్రిలో" అంది నర్స్.

అంతే క్షణంలో- తను రోడ్డు దాటబోడం, కారు మీదికి దూసుకు రావడం, కీచుమని బ్రేకు వేసిన చప్పుడు....వరసగా గుర్తొచ్చాయి అంతేకాదు తను ఊర్లో లేనప్పుడు జరిగిన అగ్నిప్రమాదంలో తన షాపు, దాంట్లో ఉన్న బొమ్మ దారుణంగా కాలి మసై పోవడం, ఉన్నట్టుండి తాను ఒక్కసారి దిక్కులేనివాడై ఉన్న ఆధారాన్ని కోల్పోడం, ఆ తర్వాత తన స్నేహితుడు శ్రీకాంత్‌కి వివరాలు వ్రాసి కట్టుబట్టలతో చాలీచాలని డబ్బుతో ఈ ఊరు రావడం, శ్రీకాంత్ గదికి వెడితే ఆ గదికి తాళం వేసి ఉండడం అతను ఈ వారం, వరకు రాడని పక్కాయన చెప్పడం, చాలీచాలని డబ్బులు ఆకలి, ఎక్కడ ఉండాలన్న ప్రశ్న.... అన్నీ ఒకదానితర్వాత ఒకటిగా శరవేగంగా గుర్తొచ్చాయి మళ్ళీ భయం, టెన్షన్ వీటిముందు జరిగిన ప్రమాదం, తగిలిన దెబ్బ లెక్కలేకుండా పోయాయి.

తను ఎలా ఉన్నాడు కాళ్ళు చేతులు అన్నీ బాగనే ఉన్నాయి క ?

ప్రశాంత్ ఒక్కసారి శరీరంలో ప్రతి అవయం మీద మనసు లగ్నంచేసి సరిగ్గా వున్నట్టు నిర్ధారించుకున్నాడు. తలమాత్రం బరువుగా ఉంది

అన్నీ సరిగ్గా ఉన్నాయి సరె జేబులో డబ్బులు-?- ప్రశాంత్ గుండె వేగంగా కొట్టుకుంది. అప్రయత్నంగా చెయ్యి జేబుమీదకి వెళ్ళింది దాన్ని గమనించిన డ్రైవర్ "మీడబ్బు నేను జాగ్రత్తచేసాను మిమ్మల్ని డిశ్చార్జ్ చేసాక నేను మిమ్మల్ని ఇంటిదగ్గర వదిలి ఆ తర్వాత వెడతాను. ఇది మా యజమాని ఆర్డర్" అన్నాడు.

ప్రశాంత్ "అమ్మయ్య" అనుకున్నాడు. ఈ దిక్కుమాలిన ప్రపంచంలో తను ఒంటరివాడు కాదు. ఆ భావన అతని హృదయానికి కొండంత బలాన్ని ఇచ్చింది అతని పెదవుల మీద చిరునవ్వు వెలిసింది

(సశేష.



# భారత్ విజయం: బ్రిటిష్ ప్రెస్

రాంగోపాల్

కపిల్

జూన్ ఇరవయి అయిదు భారత జట్టు 16 రోజుల నిరంతర శ్రమ ఫలితం "లార్డ్స్"లో శుభప్రదమయింది. క్రికెట్ గురించి తెలిసిన తెలియని ప్రతి భారతీయుడి గుండెల్లో జీవితాంత మిగిలిపోయే మధురానుభూతి, ఆ రోజు దేశం పండుగ చేసుకొంది. ప్రతి భారతీయుడి కళ్ళల్లో నేను భారతీయుడ్ని అన్న గర్వం తొణికిసలాడింది

ప్రతిష్ఠాకరమయిన "ప్రుడెన్షియల్ వరల్డ్ కప్"ని భారత జట్టు కైవసం చేసుకొంది

ఎలాంటి కథనయినా ఒక కొత్త మలుపు తిప్పడం తరంతరాలుగా భారత క్రికెట్ జట్టుకి వస్తున్న ఓ చిన్న అలవాటు. ఆ అలవాటు ప్రకారమే రెండు సార్లుగా "ప్రుడెన్షియల్ కప్"ని గెల్చుకొంటున్న వెస్టిండీస్ విజేతల్ని చిత్తుచేసి, భారతీయ జెండాని లార్డ్స్‌లో ఎగురవేసింది.




క్రికెట్‌ని "లక్కీ గేమ్"గా అభివర్ణిస్తూనే; ఆ గ్రూప్‌లో భారతీయుల విజయపరంపరలని "అదృష్ట"మంటూ రాసుకొచ్చిన "బ్రిటిష్ ప్రెస్" కలం పాళీ ఈ గెలుపుతో "ఫట్"మని విరిగిపోయింది. (వాళ్ళ భాషలోనే చెప్పాలంటే "షేమ్ షేమ్") "సెమీఫైనల్స్" చేరేవరకూ కపిల్‌దేవ్, యష్‌పాల్, రోజర్ బిన్నీ, మొహిందర్‌లవల్లే విజయాలు చేకూరుతున్నట్టుగా కనపడినా ఆ తరువాత సెమీఫైనల్స్‌లో ఇండియాకి విజయాలు మట్టుకు పూర్తిగా "టీమ్ స్పిరిట్" వల్లే చేకూరాయి

కపిల్‌దేవ్ సాధించిన 175 పరుగులు, కిర్మానీ కప్ సిరీస్‌లో రికార్డులుకాగా, ఈ సిరీస్‌లో కపిల్‌దేవ్ " నిరూపించుకొన్నాడు. బిన్నీ 18 వికెట్లు తీసుకొని "హా అవ్వటం కూడా భారతదేశానికి గర్వకారణాలే.

కపిల్‌దేవ్ మాటల్లోనే చెప్పాలంటే "ఈ విజయం. ఆత్మవిశ్వాసాన్ని ఇచ్చింది, రాబోయే పోటీల్లో కూడా విజయాలకు ఈ విజయం పునాది "

Edit d & Published by V Leelavathy Raghavaiah,
Chikkadpally, Hyd 20 & Printed by P. Ramakrishna
Printers 1-8-4/1/1, Chikkadpalli, Hyderabad-20

